# వేదమాత గాయత్రి

ప్రథమ ముద్రణ : డిశంబరు 1997
ప్రతులు : 500


మూల్యం : రూ.20/-



ముఖచిత్రం : శ్రీమతి జె. రాజ్యలక్ష్మి

ప్రతులకు :
జె.ఎస్.ఆర్.కె. ప్రసాద్
15-25/2, శ్రీ కోదండరామ నగర్,
దిల్‌సుఖ్‌నగర్, హైద్రాబాద్ - 500 060.
ఫోన్ : 4061241

టైప్ సెట్టింగ్ :
అపర్ణా గ్రాఫిక్స్, హైదరాబాద్.

ముద్రణ :
మాధవీ ప్రింటర్సు,
కుత్బిగూడ, హైదరాబాద్ - 27.

# అంకితం

సకల శక్తి స్వరూపిణీ

సకల సద్గుణ ప్రదాయిని

కరుణామృత వర్షిణీ

సదసద్వివేక విజ్ఞాన కారిణీ

జీవన్ముక్తి ప్రదాత్రి

వేదమాత గాయత్రి

పాదాంబుజములకు

# గాయత్రి

ఆమె వేదమాత ! సర్వ ధర్మ సారము. శైవ, వైష్ణవ, సనాతన, ఆర్య సమాజాది భేదములు లేకుండా అందరికీ ఆరాధ్య మంత్రము. "ధీ" చోదిత శక్తి ! గాయత్రికి ద్రష్ట విశ్వామిత్రుడు. ద్రష్ట అంటే మంత్రాన్ని వ్రాసినవాడు కాడు. మంత్రమును దర్శించినవాడు. గయి - అంటే ప్రాణములు. ప్రాణములను కాపాడే మంత్రం కాబట్టి ఇది గాయత్రి. దీనిని జపించడం వలన మనలోకి ప్రాణశక్తి (ఆక్సిజన్) ఎక్కువగా ప్రవహిస్తుంది. ఉదయ సంధ్యలో ఆమె గాయత్రి. పంచప్రాణములను పంచ ఉపప్రాణములను రక్షిస్తుంది. మధ్యాహ్నం ఈమె సావిత్రి. పంచ జ్ఞానేంద్రియములను పంచ కర్మేంద్రియములను రక్షిస్తుంది. సాయంత్రం ఈమె సరస్వతి. వాక్కు రక్షిస్తుంది. ఈమెయే కుండలిని ! శ్రీ జొన్నలగడ్డ కృష్ణ ప్రసాద్ సత్పురుషులు, బహు గ్రంథకర్త. వీరి 'లక్షణదీపిక' వంటివి సుప్రసిద్ధము. ప్రస్తుతము ఇదొక గాయత్రీ మంత్రార్థమును వివరించే లఘు గ్రంథము. సామాన్యులైన పాఠకులకు కూడా అందుబాటులో ఉండాలనే కోరికతో శాస్త్రభాషను సరళీకృతం చేశారు. భారతీయ ధర్మము వేదము, గోవు, గాయత్రి ఈ మూడింటిపైన ప్రధానంగా ఆధారపడివుంది. గాయత్రి దయవుంటే అన్నీ వున్నట్లే !! ఎన్ని వున్నా ఆతల్లి దయలేకుంటే ఏమీ లేనట్టే! శ్రీ కృష్ణ ప్రసాద్‌కు గాయత్రి మీద ప్రేరణ కలిగించి ఈ గ్రంథమును వెలువరించేటట్లు చేసింది. వారు ధన్యులు. దీనిని చదివిన వారు కేవల పఠనముతోనే తృప్తిపడక నిత్యము మంత్రోపాసన చేసెదరుగాక !

'శివకవీంద్ర' చారిత్రక నవలాచక్రవర్తి

హైదరాబాద్ - 13,

తేది : 10-12-1997

ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్

ఎం.ఏ., పిహెచ్.డి.

'కవికౌస్తుభ'
**డా॥ ఆచార్య తిరుమల**
చైతన్య కళాశాల, హైదరాబాద్-74.

# రసోమృతం

యావై సా గాయత్రీ -

ఆసీత్ - ఇయం వై సా పృథివీ - శ్రుతి

దేనిని గురించి సంపూర్ణంగా మానవ మేధస్సు ఆలోచించలేదో, దేని స్వరూపాన్ని సమగ్రంగా దర్శించలేదో, దేని శక్తిని క్షుణ్ణంగా అర్థం చేసుకోలేదో - ఆ గాయత్రిని గురించి కృష్ణ ప్రసాద్ ఈ చిన్ని పుస్తకం ద్వారా మనకు తెలియజేయటానికి ప్రయత్నిస్తున్నాడు. తల్లిని చూస్తూ ఆనందంతో ఒడిలో కేరింతలు కొడుతున్న పసికందు విధానమిది. బిడ్డల ఆనందమేగా తల్లికి కావలసింది. ఆ మాతృ వాత్సల్య లబ్ధ విశేషాలే యిటువంటి రచనలు; ఆత్మ కళ్యాణకారకాలు !

ఇది 'వేదమాత గాయత్రి'. వేదానికి మాతయైన గాయత్రి; వేదమాతయైన గాయత్రి. అంటే జ్ఞానధాత్రి! ఈ ధాత్రిని 'వర్ణా'తీతమైన కేవలానంద సస్యాలు; దివ్యమైన జన్మ-కర్మల హృదయ రహస్యాలు!

అస్మద్గురువరేణ్యులు బ్రహ్మశ్రీ చల్లాకృష్ణ మూర్తి శాస్త్రిగారు తమ 'వర్ణాశ్రమ సంస్కార విజ్ఞాన' గ్రంథంలో ప్రాకృతిక వర్ణ వ్యవస్థను సిద్ధాంతీకరిస్తూ ఈ గాయత్రీ మంత్ర రహస్యాన్ని బట్టబయలు చేసిన తీరు మహాశ్చర్య జనకంగా ఉంటుంది. ఆ మహా వాక్యాల్ని మీకోసం ఇక్కడ యధాతథంగా ఉద్ధరిస్తాను. చూడండి!

"సూర్య బింబము నుండి నలువైపుల బ్రసరింపుచు మన వైపున కరుదెంచు తేజము సావిత్రి. అనగా సౌరతేమున్నంతనే సావిత్రి కాదు; సవిత నుండి వ్యాప్తినొందునది సావిత్రి. సవితా ప్రాణమున్నచో సావిత్రీ సంబంధ

ముండును. ప్రవర్తక పిండమాత్రము సవిత. అందుండి వెడలు ప్రేరక ప్రాణము సావిత్రి.

"తముప సంగృహ్య పప్రచ్ఛ అధీహి భోః, కః సవితా? కా సావిత్రీ? ఇతి మన ఏవ సవితా వాక్ సావిత్రీ యత్ర హ్యేవ మనః తద్ (తత్ర వాక్, యత్ర వైవాక్ తన్మనః, ఇత్యేతేద్వే యోనీ, ఏతం మిధునం అగ్నిరేవ సవితా పృధివీ సావిత్రీ, యత్ర హ్యేవాగ్ని స్తత్ పృథివీ, యత్రవై పృథివీ తదగ్నిరిత్యే తే ద్వేయోనీ, ఏకం మిథునం - ఇత్యాది- (గోపథము మౌద్గల్య విద్య).

ఈ పరిభాష ననుసరించి అగ్ని నుండి వెడలు తేజము సావిత్రి. ఇదే సౌరతేజము ఒకానొక వస్తువుచే బ్రత్యాహతమై ప్రతిఫలనము నొందునపుడు దానిని సావిత్ర యనక 'గాయత్రి' యందురు. అనగా - వచ్చుచున్న సౌరతేజము అగు సావిత్రి భూమిచే బ్రత్యాహతమై తిరిగి సూర్యుని వంకకు బోవునపుడు గాయత్రి యగును. ప్రాతస్సవనీయ పార్థివాగ్ని ఈ గాయత్రి తేజోయుక్తముగా నుండును గనుక పృథివిని, పార్థివాగ్నిని, గాయత్రి యందురు. "యావై సా గాయత్రీ - ఆసీత్, ఇయంవై సా పృథివీ" ఇత్యాది శ్రుతులచే స్పష్టము. మరియు పృథివి యొక్క స్వరూపము ఆపః - ఫేన - మృత్ - సికతా - శర్కరా - అశ్మా - అయః - హిరణ్యాః అను నీ యెనిమిది భాగములు గలది. ఇట్లే అష్టాక్షర చ్ఛందమును గాయత్రీ యందురు. కనుక అష్టావయవ పృథివిని గాయత్రీ యందురు. (శత 6-1-115). అగ్ని జ్యేష్ఠులగు అష్టవసు గుణ సంబంధమున పృథివి యష్టాక్షర యగుచు గాయత్రీ యనబడుచున్నది. ఇదే విధముగ సాయం సవనీయ ప్రతిఫలితమగు నా సౌరతేజమే గాయత్రి యనబడక 'సరస్వతి' యని వ్యవహరింపబడును.

గాయత్రీ - లేక గాయత్రాగ్ని బ్రహ్మ వీర్యమునకు ప్రతిష్ఠయు, వేదమాతయు, బ్రాహ్మణ మూల ధనమునై యున్నది. "గాయత్ర్యా బ్రాహ్మణం నిరవర్తయత్", "గాయత్ర ఛందావై బ్రాహ్మణః".

గాయత్రి కేవలము ద్విజాతులకే -

"స్తుతామయా వరదా వేదమాతా ప్రచోదయన్తామ్ పావమానీ ద్విజానామ్ ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం బ్రహ్మవర్చసమ్ మహ్యాంద త్వావ్రజత బ్రహ్మలోకమ్' - **అథర్వవేదం.**

ఇక గాయత్రీ మంత్ర ద్రష్ట విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడెవరు? "ఆయుః ప్రాణమే ప్రాణులకు మిత్రము. విశ్వమునకు మిత్రమునగుటచే నీ యాయుః ప్రాణము లేక బృహతీప్రాణము 'విశ్వామిత్ర' శబ్దమున వ్యవహరింతురు. ఏ మహర్షి మొదట నీ సౌరేంద్ర తత్వోపాసన (పరీక్ష) ద్వారా యీ ప్రాణమును సాక్షాత్కరించుకొనునో ఆయన 'విశ్వామిత్రు'డని పేరొందెను" అని మా గురుదేవులు బోధిస్తున్నారు. గురోర్వాక్యమమృతమ్!

విశ్వామిత్ర ఋషి ద్వారా దృష్టమైన ఈ విశ్వామిత్ర ప్రాణాన్ని "విశ్వామిత్రం హ్యేతదహః" అంటూ ఐతరేయుడు దిగ్దర్శనం చేయించాడు. ఈ విశ్వామిత్ర ప్రాణ పరిజ్ఞానంతో ఉపాసనచేత వసిష్టుడు వశిష్ఠుడయ్యాడని కూడా వేదంలో చెప్పబడింది. అది ప్రాణ తత్వోపాసన. అది వేరే అధ్యయనం.

ఇక, ఉపనయన సంస్కారంతో సంక్రమించే యజ్ఞోపవీత పరమార్థం పూర్తిగా ఖగోళ విజ్ఞానం మీద ఆధారపడి ఉంది. దాన్ని గురించి మొదలుపెడితే అది వేరే గ్రంథమవుతుంది. ఇవన్నీ వేద విద్యా రహస్యాలు. శ్రద్ధాసక్తులతో తపః పూర్వకంగా గ్రహించాలి. యజ్ఞ విద్యను సాధించి తెలుసుకోవాలి.

కృష్ణ ప్రసాద్ ఈ పుస్తకంలో గాయత్రీ మంత్ర మహిమను వివిధ కోణాల నుండి ప్రదర్శించడానికి ప్రశంసనీయమైన కృషి చేశాడు. మహనీయుల వాక్య ప్రమాణాలతో ఈ రచన చేశాడు. తాత్త్విక చింతనలో తలమునకలవుతున్న ప్రసాదును చూచి మన జాతి తలెత్తుకు తిరిగే రోజు దగ్గరపడుతూ వుందని నేను భావిస్తున్నాను.

"ధియో యోనః ప్రచోదయాత్"!

భక్త పరమాణువు,
**ఆచార్య తిరుమల**

హైదరాబాదు,
ది. 17-12-1997

మాతృ దేవోభవ! పితృ దేవోభవ!

# కృతజ్ఞతామృతం

గురోర్వాక్య మమృతమని వేద మాతగూర్చి విపులంగా, శ్రేష్ఠంగా వివరించిన అస్మద్గురువరేణ్యులు ఆచార్య తిరుమల గారికి-

కొండంత ముదముతో విజ్ఞానదాయికంగా వేద మాత గూర్చి స్పష్టీకరించిన డా॥ ముదిగొండ శివప్రసాద్ గారికి-

తొలి రచన నుండి ముఖచిత్రాన్ని రసస్ఫోరకంగా మూర్తిమంతంజేసి సహకారాన్నందిస్తున్న నా సహధర్మచారిణి శ్రీమతి రాజ్యలక్ష్మికి-

అన్ని విధాలా ప్రచురణకు తోడ్పడిన వారందరికీ, ప్రతి రచనకూ నేనున్నానంటూ ప్రోత్సహించే ఆత్మీయుడు శ్రీ వి. చలపతిరావు గారికి-

అమ్మవారి గురించి వ్రాయమని సలహానిచ్చి ప్రేరేపించిన సోదరతుల్యుడు శ్రీ అడుసుమిల్లి లీలా ప్రసాద్ గారికి-

ముద్రణ చేసి పుస్తకాన్నందించిన శ్రీ గణేష్ బాబు గారికి -

మరి అందరికీ...

మీ విధేయుడు,

- కృష్ణప్రసాద్

# వేదమాత గాయత్రి

ఓం శ్రీగాయత్రీ దైవ్యై నమః

సకలసృష్టికారిణి జనని భూమాత, గోమాత, భరతమాత, జన్మనిచ్చిన మాతలను గౌరవించి పూజించుట భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రతీక. ఈ సంస్కారాన్ని పెంపుజేసుకొనుట మనందరి కాదర్శనీయం. మరి సర్వ మాతలకూ మాతయైన ఆ గాయత్రీమాత నుపాసించిన సిద్ధించని దేదియూ లేదు. ఆ మాతను గూర్చి తెలుసుకొని తరించేముందు ఆమెను స్మరించుట సముచితం.

*శ్లో॥ ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణై*
*ర్యుక్తామిందు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికామ్*
*గాయత్రీం వరదా భయాంకుశకశాః శుభ్రం కపాలం గదామ్*
*శంఖం చక్రమథారవింద యుగళం హస్తైర్వ హంతీంభజే ॥*

గాయత్రీ మంత్రం యొక్క వివరాలు, విశిష్టతను గూర్చిన విషయాలను క్లుప్తంగా ముందు పొందుపరుస్తున్నాను.

వేదమంత్రములలోకెల్ల గాయత్రీ మంత్రం బహు పురాతనమైనదేగాక మిక్కిలి శ్రేష్ఠమైయున్నది. సృష్ట్యాదినుంచి గూడ ఈ మంత్రాన్ని జపించువారి సంఖ్య నానాటికీ అత్యధికమగుచున్నదనుటలో ఏమాత్రమూ అతిశయోక్తిగాని, ఆశ్చర్యముగాని లేదు. ఈ మంత్రపఠన బలము వలన బుద్ధి కుశలత, మానసిక వైశాల్యమేగాక వ్యక్తియందు వర్చస్సు పెరుగుటలో సందియమే మాత్రమున్నూ లేదు. పురుషులు, స్త్రీలు, అన్ని జాతుల వారు శుచితో, శ్రద్ధతో, నియమముతో ప్రతినిత్యమూ జపించిన తేజోవంతులు, మేధాశాలురై ఆత్మానుభూతిని పొందగలరు.

శ్రీశంకరాచార్యులవారు శ్రీ గాయత్రీమంత్రార్థమును వివరిస్తూ వ్రాసిన

భాష్యము 'శ్రీశకంఠ భాష్యము' అనుపేర చాలా ప్రసిద్ధమైనది.

*'గాయత్ర్యాది ఛన్దో విశిష్టానామ్*
*ఋచాం గాయత్రీ ఋక్ అహమ్ ఇత్యర్థః*

*-శ్రీ ఆది శంకరాచార్యులు*

ఋగ్వేదములో గల గాయత్ర్యాది ఛందస్సులన్నిటి లోను శ్రేష్ఠము, అగ్రగణ్యమైనది గాయత్రీ ఛందస్సు. ఇది మహర్షుల సత్యవాక్కు. జగత్తులో శ్రేష్టత్వ మెక్కడ కన్పించిననూ అది కేవలము భగవంతుని విభూతియే. అట్లే గీతాచార్యుడు గాయత్రియే తానని భగవద్గీతలో 'గాయత్రీ ఛన్దసామహం' అని చెప్పియున్నాడు.

'గాయనాత్ త్రాయతే ఇతి గాయాత్రీ' అనగా దేనిని జపించుట లేక గానము చేయుట వలన దుఃఖసాగరము నుండి రక్షణ కలుగునో అదియే 'గాయత్రి'యని ఈ వ్యుత్పత్తియొక్క అర్థము. 'మననాత్ త్రాయతే ఇతిమన్త్రః' అనగా దేనిని మననము చేసుకొనుట వలన అనగా పదేపదే మనస్సునందు అర్థ స్ఫురణతో జపించుట వలన సంసారతరణోపాయము లభించునో దానిని మంత్రమందురు. ఈ విధముగా శబ్ధపరముగా, మంత్రపరముగా కూడా శ్రీ గాయత్రీ మంత్రమునకు సాధనలో ప్రత్యేక స్థానము గలదు.

గాయత్రీ బీజమంత్రము శబ్ద బీజములైన అపూర్వ, అలౌకిక పదములే శబ్ద బ్రహ్మ. అదియే వేదము. ఆ వేదమే శ్రీ గాయత్రీ మంత్రము. కాబట్టి ఇది బీజమంత్ర మగుచున్నది. ఈ శబ్ద బ్రహ్మము అపౌరుషేయమగుట వలన అమానుష శక్తి మహత్త్వము కలిగియున్నది. ఈ విధముగా కూడా విశిష్టత కలిగియున్నది.

*శ్లో॥ జకారోజన్మ విచ్ఛేదః పకారోపాపనాశనః*
*జన్మకర్మ హరోయస్మాత్ తస్మాజ్జప ఇతీర్యతే ॥*

జ : జన్మ విచ్ఛేదసూచకము, ప : పాపనానశసూచకము. అనగా 'జప' మను శబ్ధము జన్మ కర్మహరణోపాయమునకు మోక్ష మార్గసూచకము. జపప్రక్రియ మరి విశిష్ట గాయత్రితో కూడినదైన సాధకునకు త్వరితగతిన సంపూర్ణ ఫలసిద్ధి లభించుచున్నది నిర్వివాదాంశము.

ఏమంత్రమైనను గురువు ద్వారా ఉపదేశింపబడిన మహత్తర ఫలదాయకమగునని శాస్త్ర హృదయము. ఉపనయన సందర్భమున గాయత్రీ మంత్రమును తండ్రే గురువుగా తనయునకుపదేశించును. ఈ మంత్రాన్ని భావయుక్తంగా జపించడం వలన మానవ హృదయం పరిశుద్ధమవుతుందన్నది అనుభవైక వేద్యం. లౌకిక, భౌతిక లాభాలనుద్దేశించి మాత్రంగాక శుద్ధ జ్ఞానానికై మాత్రమే జపించవలెను. విశ్వామిత్రుడీ మంత్రానికి ఋషి. ఈ మంత్రం శుక్ల యజుర్వేదంలో కూడా కనబడుతుంది.

గాయత్రీ మంత్రానికి అధిదేవత సవిత్రుడు. సవిత అనగా సూర్యుడు. ప్రకాశాన్నిచ్చే సూర్యుని కోసం చేసే ప్రార్థన ఇది. శ్రీ కృష్ణుడు సూర్యచంద్రాదులు, మిగిలిన అన్ని ప్రకాశాలు తన ప్రకాశమేనని గీతలో వచించాడు.

శ్లో॥ *యదాదిత్య గతం తేజో జగద్భాస యతేఖిలమ్।*
*యచ్చన్ద్రమసియచ్చాగ్నౌ తత్తేజో విధిమామకమ్ ॥*

కాబట్టి సవిత చైతన్య ప్రకాశమైన అనంత బ్రహ్మతత్త్వం కంటె వేరుగాదని తెలుస్తున్నది. సావిత్ర అధిదేవతగా ఉండుటచే సావిత్రీ మంత్రమని వైదిక వాఙ్మయంలో పేర్కొనబడినది. కొన్ని ప్రాచీన గ్రంథాలు 'సావిత్రీగాయత్రి' యనికూడా పేర్కొన్నాయి.

మనస్సును శుద్ధమొనర్చు సంధ్యావందన క్రియలో గాయత్రీ మంత్రం జపించబడుతుంది. దానికి పూర్వము గాయత్రీ హృదయమైన ఈ మంత్రమును పఠించవలెను.

*ఓమిత్యే కాక్షరం బ్రహ్మే త్యేతద్ధృదయ ముచ్యతే*
*గాయత్ర్యా స్తత్పతిత్వాదౌ జపకర్మ సమాచరేత్*

*మంత్రం :*

*ఓమిత్యే కాక్షరం బ్రహ్మ, అగ్ని ర్దేవతా*
*బ్రహ్మ ఇత్యార్షమ్ గాయంత్రం ఛందం*
*పరమాత్మమ్ సరూపమ్ సాయుజ్యం వినియోగమ్ ।*

ప్రతి సంధ్యలోను దశగాయత్రి చేస్తారు. అయినను భక్తి, శ్రద్ధలతో ఎన్నిసార్లై

నను జపించవచ్చును. సంఖ్యా నీమము లేదు. సూర్యాస్తమయం తర్వాత మాత్రం జపించరాదు. గాయత్రి వేదమాత. గాయత్రి జపం వేద పఠనంతో సమానం. ఈ మంత్రంలో ప్రగాఢ వేదాంత తత్త్వం ఇమిడియున్నది. తన బుద్ధికి అనంత ప్రకాశమిమ్మని సూర్య దేవుని గూర్చి చేయు ప్రార్థన వలె వుంటుంది. సమదృష్టిని ప్రసాదిస్తుంది.

గాయత్రీ మంత్రం సర్వ వేదసారము. ఉపాసనా గాయత్రీమంత్రము లేక ప్రాణాయామ గాయత్రీ మంత్రమనికూడా అందురు. పూజలలో సంకల్పము చేయునపుడు కూడా దీనినుచ్చరింతురు. భోజనానికి ముందు శ్రద్ధతో పఠిస్తారు. అనేక ఇతర సందర్భాలలోనూ స్మరించుదురు.

అమ్మ దయాస్వరూపిణి. అట్లే గాయత్రీ మాత దయవుంటే అన్నీ ప్రాప్తిస్తాయి. అందుకే దయగల తల్లిని మించిన దైవము ఏ లోకంలో వెదకి చూచినా కానరాదని విజ్ఞుల అభిప్రాయము, అనుభవమున్నూ. దైవ ప్రార్థనలేని జీవితం, దైవానుగ్రహం పొందని జీవితం నిరర్థకం. శ్రీ గాయత్రీ సహస్రనామాల్లో 'ఓం కాళికాయై నమః' అని వర్ణింపబడియున్నది. అనగా కాలవర్ణంతో శోభిల్లుతూ భక్తజనులను దుర్మార్గుల బారినుండి కాపాడు కాళీమాతకు వందనాలు. అదేవిధంగా సహస్రనామస్తోత్రంలో 'కాళిందీ కాళికా కాంచీ కలశోద్భవ సంస్తుతా' అనియు స్తుతింపబడియున్నది. కాళికా రూపంలో 'క్లీం' యను శక్తితో దుష్టుల శిక్షించి శిష్టుల రక్షిస్తుంది. అలా కాళీమాత నుపాసించి గదాధరుడు శ్రీరామకృష్ణ పరమహంసగా ఆధ్యాత్మిక అధ్యాయంలో చిరస్థాయిగా నిల్చిపోయాడు. వివేకానందుణ్ణి తనవారసుడిగా మనకందించాడు. అట్లే పామరుడైన కాళిదాసు ఆమె అనుగ్రహంతో మహాకవిగా ప్రసిద్ధికెక్కినాడు. తెనాలి రామకృష్ణుడు కూడా తల్లి అనుగ్రహంతో వికటకవియై శ్రీకృష్ణదేవరాయుల భువన విజయంలోని అష్టదిగ్గజాల్లో ముఖ్యదిగ్గజమై రాయలవారికి ఆప్తుడు, మనకు ఇష్టుడూ అయినాడు. ఇలా ఎందరో మహానుభావులు తల్లి దయతో తరించారు, తరిస్తున్నారు.

వాల్మీకి రామాయణానికి మూలాధారం గాయత్రీ మంత్రం. ఇందు 24 వేల శ్లోకాలున్నాయి. ఒక్కొక్క అక్షరానికి వ్యాఖ్యానరూపంలో వేయి శ్లోకాలు రచింపబడినాయి. లేదా ప్రతివేయి శ్లోకాలకు ఒక్కొక్క అక్షర సంపుటి శ్లోకారంభంలో

చేయబడినదనియు చెప్పవచ్చును. ఈ 24 అక్షరాలు ఆరంభంగా గల శ్లోకాలే గాయత్రీ రామాయణంగా ప్రసిద్ధికెక్కింది. ఈ 24 శ్లోకాలు జ్ఞాన రత్నాలు. గాయత్రీపూజ చేయుటవలన సాధకుని ఆత్మ, బుద్ధి, చిత్తాదులు పవిత్రమవుతాయి. బ్రహ్మశక్తి ప్రాదుర్భవించి శుభగుణాలు అభివృద్ధి చెందుతాయి. వేదమాతయైన గాయత్రి బ్రహ్మయొక్క ఆద్యాశక్తి. సర్వ యుగాలలోను గాయత్రీ ఉపాసనయే సర్వ శ్రేష్ఠమైనదిగా అంగీకరింపబడినది. భౌతిక, ఆధ్యాత్మిక వృద్ధి కలుగుతుంది.

గాయత్రీ మంత్రంలోని 12వ అక్షరంతో సుందరకాండ ప్రారంభమవుతుంది. అందుచే కూడా సుందరకాండను నిత్య పారాయణ చేయుటకు ప్రసిద్ధమైనది. సర్వకార్య ఫలసిద్ధి, ఐహికాముష్మిక ఫలప్రాప్తిలభిస్తుంది. శ్రీ గాయత్రీ - సుందరకాండ అను గ్రంథాన్ని శ్రీ కల్లూరి సూర్యనారాయణ గారు రచించి గాయత్రీ వైశిష్ట్యాన్ని వెల్లడించారు. ఈ విధంగాకూడా గాయత్రీ మంత్రం విశిష్టమైయున్నది.

జపములేక ధ్యానమున కుపయుక్తమగు శ్రీగాయత్రీ మంత్రమును శుద్ధ గాయత్రీ మంత్రమని అందురు.

శ్రీ గాయత్రీ మంత్రము :

***ఓం భూర్భువ స్సువః***
***తత్స వితుర్వరేణ్యం ।***
***భర్గో దేవస్య ధీమహి***
***ధియో యోనః ప్రచోదయాత్ ॥***

ఈ మంత్ర వివరణ ఈ విధంగా వివరించబడింది. :

ఓం : ఆది మంగళము

భూర్భువ స్సువః : మొదటి మూడు వ్యాహృతులు

తత్స వితుర్వరేణ్యం : ప్రథమ పాదము

భర్గో దేవస్య ధీమహి : ద్వితీయ పాదము

ధియో యోనః ప్రచోదయాత్ : తృతీయ పాదము

24 అక్షరములతో నున్న ఈ మూడు పాదముల గాయత్రిని 'చతుర్వింశతి

- గాయత్రి' అని అందురు.

ఓ మాపో జ్యోతిరసోమృతంః మధ్య మంగళము మరియు చతుర్థ పాదము. దీనినే గాయత్రీ శిరస్సుయని కూడా అందురు.

బ్రహ్మ భూర్భువస్సువరోమ్ : వాక్య విశేషము మరియు అంత్య మంగళము. వీనిని అంత్య వ్యాహృతులందురు. ఇందలి ఓంకారము అంత్య ప్రణవము అనగా ఆఖరున మంగళము కొరకు మరియు ఉపసంహారముగా చెప్పబడినది.

వ్యాహృతిని గూర్చి క్లుప్తంగా వివరించెదను.

**వ్యాహృతి :** విరాడ్రూపియైన భగవంతుని సంబంధమైన జ్ఞానమును ప్రకాశింపజేయునది. బ్రహ్మయొక్క జ్ఞాన దేహము నుండి వ్యాహరింపబడుటచే 'వ్యాహృతుల'ని పేరు వచ్చినది. వ్యాహృతుల నుండియే అగ్ని, వాయువు, సూర్యుడు ఉద్భవించిరి. వ్యాహృతులను జపించిన సర్వ వేదపఠన మహిమ సిద్ధించును.

సావిత్రి, గాయత్రి, సరస్వతి, దుర్గ, మాయ, ప్రకృతియనునీ నామములన్నియూ ఒకేయొక పరాశక్తి కన్వయించబడిన నామములు. గీతకు గల 18 నామములలో గాయత్రి కూడా గలదు.

***శ్లో॥ గీతా గంగాచ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే***
***చతుర్గాకార సంయుక్తే పునర్జన్మన విద్యతే ॥***

గీత, గంగ, గాయత్రి, గోవిందుడు జన్మ రాహిత్యాన్ని సంయుక్తంగా ప్రసాదిస్తాయి.

గాయత్రీ మంత్రము అంతిమ గమ్యమైన ప్రత్యక్ బ్రహ్మైక్య'మును సాధకునకు బోధిస్తుంది. ప్రత్యక్ : ప్రతి జీవుడూ నేను అను పదముతో సూచించు ఆత్మ లేక జీవాత్మ. బ్రహ్మ : సమస్త భువన స్వరూపుడై స్థూల దృష్టితో సమస్త చరాచరములను తన స్థూల శరీరములో ఇముడ్చుకొని విరాట్ స్వరూపుడైయున్న హిరణ్య గర్భుని యొక్క అనగా పరమేశ్వరుని యొక్క యథార్థమైన నిర్గుణస్వరూపము. దీనినే 'పరబ్రహ్మము' లేక 'పరమాత్మ' యందురు. జీవాత్మ

పరమాత్మ ఒక్కటేనన్న జ్ఞానాన్ని 'ప్రత్యగ్‌బ్రహ్మైక్యమం'దురు. ఇదియే శుద్ధ గాయత్రి మంత్రము యొక్క ముఖ్య ప్రయోజనము. ఇది శంకరాచార్యుల వారొసగిన అర్థము. ఈ మంత్రాన్ని ఐదవ మహావాక్యంగా పరిగణిస్తారు. మిగిలిన నాలుగు మహావాక్యాల గూర్చి పిదప తెలుసుకొనెదము.

శ్రీ శంకర భగవత్పాదులిచ్చిన వివరణ ఈ విధంగా ఉన్నది.

ధియో యోనః ప్రచోదయాత్: 'తత్త్వమసి' మహా వాక్యములో 'త్వం' పదము వలె ప్రత్యగాత్మను అనగా జీవాత్మను బోధించుచున్నది.

తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్యః 'తత్త్వమసి' మహా వాక్యములో 'తత్' పదము వలె ప్రత్యగాత్మయొక్క విభిన్న స్వరూపమనబడు పరబ్రహ్మమును అనగా పరమాత్మను బోధించుచున్నది.

ధీమహి : తత్త్వమసి మహావాక్యములో 'అసి' పదమువలె ప్రత్యగ్ బ్రహ్మైక్యమును అనగా జీవాత్మ, పరమాత్మల ఏకత్వమును ధ్యానవిషయంగా బోధించుచున్నది.

ఈవిధంగా శుద్ధ గాయత్రీ మంత్ర మహావాక్యములలో మొట్టమొదటి ఉపదేశ మహావాక్యమైన 'తత్త్వమసి' అను మహావాక్యము వలె గొప్ప మహా వాక్యమైనది. అందుకే దీనిని ఐదవ మహావాక్యమనియు, సాధన మహావాక్యమనియూ పేర్కొనుట జరిగినది.

ఉపదేశ మహావాక్యములు :

1) తత్త్వమసి (సామవేదము)

2) అనుభవ మహావాక్యము : అహం బ్రహ్మాస్మి (యజుర్వేదము)

3) నిర్దేశ మహావాక్యము : ప్రజ్ఞానాంబ్రహ్మ (ఋగ్వేదము)

4) నిరూపణ మహావాక్యము : అయమాత్మా బ్రహ్మ (అధర్వణ వేదము)

ప్రాణాయామ గాయత్రీ మంత్రంలో ప్రణవాది సప్త వ్యాహృతులు గలవు. 1) ఓం భూః, 2) ఓం భువః, 3) ఓగ్ం సువః, ) ఓం మహః, 5) ఓం జనః, 6) ఓం

తపః, 7)ఓగ్ం సత్యమ్.

గాయత్రీ మంత్ర వివరణలు మరికొన్ని ఈవిధంగా స్పష్టీకరించడం జరిగినది.

గాయత్రీ శిరస్సైన 'ఆపోజ్యోతిరసోమృతం' :

ఆపో : ఆత్మకంటే వేరుగాని పరబ్రహ్మము యొక్క సర్వ వ్యాపక స్వరూపము.

జ్యోతి : పరబ్రహ్మము యొక్క ప్రకాశస్వరూపము అనగా తేజోరూపము

రసః : పరబ్రహ్మము యొక్క సర్వాతిశయ అనగా సర్వోత్కృష్ట రూపము.

అమృతం : జనన మరణములు మొదలగు సంసార బంధ కారణములు లేని పరబ్రహ్మము యొక్క నిత్యముక్త స్వరూపము.

ముక్తి కొరకు ఉపాసనాదులు సలుపుట గాయత్రీ మహామంత్రము యొక్క పరమరహస్యము, పరమ ప్రయోజనము.

ఓంకారం గూర్చిన వివరణ మీ విధముగా నున్నది.

ఓంకారము : సృష్టిరచనకు శబ్ద రూపంలో పరమాత్మ యొక్క ఆది శక్తియని మనము గ్రహింపవలెను. పరమాత్మ యొక్క స్వయం సిద్ధమైన స్వయంగా ప్రకటింప బడిన నామము గనుక ఓంకారాన్నే ప్రాచీన ఋషులందరూ సర్వ మంత్రాలకూ మూలంగాను, మూల కారణంగాను స్వీకరించారు. దీనినే ప్రణవమని కూడా అంటారు. ఓంకారం నుండే సప్త వ్యాహృతులూ ఉత్పన్నమైనాయి. యజుర్వేదం 'ఓంస్మర' అనగా ఓం కారాన్ని స్మరించు అని చెబుతోంది.

శ్లో॥ *ఓం స్మరణాత్ కీర్తనాద్వాపి శ్రవణాచ్ఛ జపాదపి ।*
*బ్రహ్మ తత్రాప్యతే నిత్యమో మిత్యే తత్పరాయణః ॥*

ఓంకారము యొక్క స్మరణ, కీర్తన, శ్రవణ, జపాదుల వలన మానవుడు పరబ్రహ్మను పొందుతాడు.

వేదవ్యాస మహర్షి 'ప్రణవం మన్త్రాణాం సేతుః' అని చెప్పాడు. అనగా మంత్ర సిద్ధిని పొందడానికి ప్రణవం సేతువువంటిది.

విద్యాంసులు, ఆచార్యులు ఓంకారానికి 19 అర్థాలీవిధంగా ప్రసాదించారు.

1) సంసార సాగరం నుండి రక్షించునది.

2) సర్వ కాలాలలోనూ సమిష్టి నియతి జ్ఞాతయైనది. అనగా తెలుసకోదగిన లక్ష్యమైనది.

3) నిఖిల విశ్వానికి కాంతినిచ్చునది.*

4) భక్తులను ప్రేమించునట్టి ఆనంద స్వరూపమైనది.

5) భక్తులకు తృప్తి కలిగించునట్టి శాంతస్వరూపమైనది.

6) జీవుల భావాలను సర్వదా గ్రహించగల్గునట్టిది.

7) సూక్ష్మాత్మ స్వరూపంతో సర్వ ప్రాణులయందూ ప్రవేశించునది.

8) సూక్ష్మతను, గుప్తతను, శబ్దాలను ఆలకించునది.

9) చరాచర జగదాంతర్యానికి స్వామి, శాసకుడునూ అయినది.

10) పర్మేశ్వర యుక్తము, సర్వుల యాచనలకూ లక్ష్యమైనది.

11) సమస్త క్రియలకూ సంచాలకమైనది.

12) స్వయంగా ఇచ్ఛారహితంగా వుంటూ సర్వుల శుభేచ్ఛలనూ ప్రకాశింపజేయునది.

13) జ్ఞాన, విద్యా, తేజస్స్వరూపము, అంధకార నాశనమైనది.

14) అప్రతిహతమైన, ఇంద్రియాతీతమైనదే అయినా ప్రత్యణువులోనూ వ్యాపించియున్న కారణంగా శుద్ధాంతః కరణలో స్వస్వరూప ప్రదర్శకమైనది.

15) సర్వ వ్యాపకమై సర్వజ్ఞమైనది.

16) ధర్మావలంబుల అజ్ఞానాన్ని నాశనం చేయునట్టిది.

17) సుఖదాయక పదార్థాలను పోషించునట్టి బుద్ధిని కలుగజేయునది.

18) ప్రళయ వేళలో స్థూల జగత్తును తనలో లయంచేసుకొను శక్తిగలది.

19) సృష్టికాలంలో సూక్ష్మప్రకృతిని స్థూల మార్గంలోకి తీసుకొని వచ్చునది.

ఓంకారముచే వ్యాహృతులు, వ్యాహృతులచే వేదములు ఆవిర్భవించినవి. భూః నుండి ఋగ్వేదము, భువః నుండి యజుర్వేదము, సువః నుండి సామవేదము ఏర్పడినవి. ఓంకారముచే త్రిమూర్తులు వారి తత్త్వములను పొందగల్గిరి.

ఓంకార రహితముగా చేసిన హోమము, యజ్ఞము మొదలగు సమస్తకర్మలు నిష్ఫలములు. అవిచ్ఛిన్నముగు తైలధారవలెను, దీర్ఘమగు ఘంటా నినాదమువలెను నిరంతరము ప్రణవముపాసించువాడే బ్రహ్మవేత్త.

'అప్లవ్యాప్తౌ' అను ధాతువునుండి సిద్ధించిన ఓంకారమునకు అంతటా వ్యాపించునదియనియు, 'అవరక్షణే'యను ధాతువునుండి సిద్ధించిన ఓంకారమునకు సంసార సముద్రము నుండి రక్షించునది యనియు అర్థములు గలవు.

భూః భువః స్వః : ఈ మూడు వ్యాహ్నతులూ అత్యంత గూఢ రహస్యాలతో సంపూర్ణమై ఉన్నాయి. గాయత్రీ మంత్రమున ఓంకారము తర్వాత ఇది వచ్చును. త్రిమూర్తులు కూడా గాయత్ర్యుపాసన చేస్తారు. మానవమాత్రులమైన మనము ఉపాసన చేయవలయునని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. ఈ త్రయానికి ఎన్నియో త్రికములతో సంబంధము గలదు.

1) పృథ్వి, అంతరిక్షం, స్వర్గం - త్రిలోకాలు

2) బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు - త్రిమూర్తులు

3) ఉత్పాదక, పోషక, సంహారం - త్రిశక్తులు

4) సత్త్వము, రజస్సు, తమస్సు - త్రిగుణాలు

5) సత్యం, శివం, సుందరం - మూడు రూపాలు

6) అగ్ని, వాయువు, జలము - మూడు తత్త్వాలు

7) బ్రహ్మ ప్రకృతి, జీవుడు - స్వరూప త్రయము

8) భూత, వర్తమాన, భవిష్యత్తు - త్రికాలములు

ఇలా సమస్త త్రికములతో సంబంధము కలిగియున్నది. ప్రాణాలను రక్షించునది అని కూడా 'గాయత్రి' శబ్దానికర్థము గలదు.

తత్ : ఆ లేక అదియని అర్థము. మహామంత్రంలో పరమాత్మవైపు సంకేతం చేయును.

వరేణ్యం : శ్రేష్ఠమైనది, ఉత్తమమైనది, పఠించదగినదియని అర్థము.

భర్గః : మనో వికారాలను, పాపాలను నాశనం చేసి బుద్ధినావరించియున్న అజ్ఞానాంధకారాన్ని దూరము చేయునట్టి ఈశ్వరీయమైనశక్తి.

దేవస్య : దురాచారాల నుండి బహిర్గతమై మహత్వాన్ని పొందును.

ధీమహి : ధరించుటయని అర్థము. అనగా పూర్వ శబ్దమైన దేవత్వాన్ని త్రికరణ శుద్ధిగా ధరించునట్టి సామర్థ్యాన్ని పొందుట. ధ్యానం చేయమని కూడా అర్థము కలదు.

ధియః : ధీ అనగా బుద్ధియని అర్థము. సద్బుద్ధివైపు సంకేతము చేయబడింది. దుర్బుద్ధివైపు మాత్రంకాదు. పవిత్ర, ఉత్కృష్ట, పరమార్థ, సాత్త్విక బుద్ధినే 'ధీ' శబ్దంతో వ్యవహరిస్తారు.

యో(యః) : ఎవడైతే యని అర్థము. పరమాత్మవైపు యః శబ్ద ప్రయోగం చేయడం జరిగింది.

నః : బహువచనంలో ప్రయోగింపబడింది. అనగా భగవంతుని నుంచి పొందాలనుకొన్నది తనకేగాక సర్వులూ పొందాలను ఆకాంక్ష, సద్విచారము. అనగా సర్వులూ సుఖశాంతులు పొంది పరమాత్మను పొందాలనే కళ్యాణకర భావన.

ప్రచోదయాత్: ప్రేరేపించుట, ఉత్సాహపరచుట, వర్థిల్లజేయుట యని అర్థము. సద్బుద్ధిని వర్థిల్లజేయును.

**బ్రహ్మ పురాణం ఈ విధంగా వివరిస్తుంది.**

భూః : పృథ్వి, లోకము

భువః : అంతరిక్షము

స్వః : స్వర్గలోకము
తత్ : తేజస్సు అనగా అగ్ని దేవత
సవితుః : ఆదిత్యుడు
వరేణ్యం : ప్రజాపతి
భర్గః : అప్ అనగా సర్వదేవతాత్మకమైనది.
దేవస్య : దేవుడైన వాడే పురుషుడు అనగా విష్ణువు
ధీ : ప్రాణము, ఏదైతే ప్రాణమో అదియే వాయువు
యః : ఆధ్యాత్మికము
నః : పృథ్వి, యోన్యాధారమైనది
ప్రచోదయాత్: కోరికలు కలిగియుండుట.

**భరద్వాజ మహర్షి ఈవిధంగా వ్యాఖ్యానమీయడం జరిగింది.**

తత్ : సూర్యమండల స్థితమైయున్న అనుపమ తేజస్సు
సవిత్ర : సమస్త ప్రాణులనూ సృష్టించునది
వరేణ్యం : వరణీయమైనది, ప్రార్థించదగినది. నియమాలు పాటిస్తూ నిష్ణాతులైన పురుషుల ద్వారా ధ్యానించ యోగ్యమైనదని అర్థము.
ధీమహి : చింతన చేయుట, నిగమనిరుక్తమైన విద్యారూప నేత్రాలతో ఆదిత్యునిలో ఉన్న హిరణ్మయ పురుషుని ధ్యానించుట.
ధియః : సవిత్ర భగవానుని మేమూ వరిస్తున్నాము, ధ్యానిస్తున్నాము.
యః నః ప్రచోదయాత్ : ఈ తేజస్సు మా యొక్క బుద్ధిని శ్రేయస్కర కార్యములందు ప్రేరేపించును గాక.

ఆదిశంకరాచార్యుల వారు :

భూః సత్ భువః : సమస్తాన్ని ప్రకాశింపజేయునది, అనగా చిద్రూపము.
స్వః : సుప్రియతే అనగా సర్వాధిక ప్రదితమైన సుఖరూపము.

ధియో యోనః ప్రచోదయాత్ : బుద్ధిని ప్రేరేపిస్తుంది. అంతఃకరణ ప్రకాశియై, సర్వసాక్షియై ఏదైతే ఉన్నదో అదియే ప్రత్యగాత్మ. ప్రచోదయాత్ శబ్దం ఆత్మ స్వరూప భూతమైన పరబ్రహ్మ యొక్క 'తత్సవితుః' ఆదిగా గల పదములచే చెప్పబడినది.

వరేణ్యం : సర్వ వరణీయమ్, నిరతిశయానంద రూపమైయున్నది.

భర్గ : అవిద్యా స్వరూపమైన దోషాన్ని నాశనం చేయునట్టి జ్ఞాన స్వరూపము.

దేవస్య : సర్వాన్ని ప్రకాశింపజేయునట్టి అఖండాత్మ రస స్వరూప దేవుడు.

సవితుర్దేవస్య : బుద్ధితో సమస్త పదార్థముల సాక్షిరూపమైన దైవ స్వరూపము సర్వాధిష్ఠానమైనది. ఆ పరమానంద సర్వానర్థ రహిత, స్వయం ప్రకాశ చైతన్య రూప బ్రహ్మను ధ్యానిస్తున్నాము.

గాయత్రీ మంత్రం సర్వాత్మక బ్రహ్మను, బోధపరచుచున్నది. ఈవిధంగా అనేక మంది మహాపురుషులు, మహాత్ములు గాయత్రీ మంత్రార్థాన్ని చక్కగా విపులంగా విశదీకరించారు.

వాస్తవంగా స్వయంగా బ్రహ్మదేవుని శ్రీముఖం నుండి బహిర్గతమైనది శ్రీ గాయత్రీ మహామంత్రం. అనేక గూఢ రహస్యాలతో, తత్త్వాలతో, శక్తులతో, అర్థాలతో నిండివున్న కారణాన మహామంత్ర రాజమని పిలువబడుచున్నది. సమస్త వేద, పురాణ, ఉపనిషత్తుల, శాస్త్రాదుల జ్ఞానతత్త్వం సర్వస్వం సన్నిహితమైవుంది. అందుకే మహా మంత్రాదిష్ఠాత్రి అయిన గాయత్రీ దేవిని సాక్షాత్తూ జ్ఞాన జననిగా ఆరాధిస్తున్నారు. గాయత్రీ దేవి, గాయత్రీ మహామంత్ర రాజము రెంటి మహిమ అవర్ణనీయమైనది, అర్ణవమంత గంభీరమైనది. సర్వోత్తమ సాధనమై భాసిల్లుతున్నది.

మరికొన్ని వివరణలీవిధంగా ఈయబడినాయి.

సవితః : సవితృశబ్ధమునకు సూర్యుడని అర్థము. సూర్యుడు తేజస్స్వరూపి, ప్రత్యక్ష దైవము. ఆధ్యాత్మిక పరిభాషలో తేజోమయమైన సృష్టికర్తనే 'సవిత' యందురు. అట్టి సవితనే గాయత్రీ మంత్రమున నుసాపింతురు. సమస్త ప్రాణుల ఆత్మ సూర్యుడే. సమస్త భూతముల

రక్షించుట చేతను కూడా 'సవిత' యందురు. సవితయే భూతోత్పత్తికి కారకుడు. సూర్యుడిని అగ్ని యందురు. అగ్నియే సమస్త ప్రాణులనుత్పత్తి చేయును.

వరేణ్యం : కోరుటకు, స్వీకరించుటకు, ధారణ చేయుటకు యోగ్యమైన దానిని వరేణ్యమందురు. హంస నీటిని విడిచి పాలుమాత్రమే గ్రహించునట్లు మన దృష్టికోణము వరేణ్యమైన యెడల చెడును విసర్జించి, మంచి విషయములను మాత్రమే పొందగలము. సర్వ ప్రాణులందు శ్రేష్ఠత్వము గోచరించును. పరమాత్ముని శ్రేష్ఠమైన దృష్టి నలుమూలల దృగ్గోచరమగును.

'వరేణ్యం సేవ్యం' అనగా కోరదగినది, సేవింపదగినది.

భర్గః : చెడు నుండి, అజ్ఞానాంధకారము నుండి తప్పించి రక్షించు పరమేశ్వరుని 'భర్గ' యందురు. ఈ భర్గము అన్నిటికంటె శ్రేష్ఠము, పరిపూర్ణమగుటచేత పురుషుడని చెప్పబడును. సంసార భీతుల వైదొలగించి కళ్యాణము కలిగించుట చేత శివుడని చెప్పబడెను. పాపములను నశింపజేయు సూర్యమండల తేజమే భర్గము.

సృష్టి, స్థితి, లయ కారణమైన శక్తి తన ప్రకాశముచే సర్వ ప్రకాశములకు ప్రకాశమిచ్చును. గాయత్రియే భర్గము. భర్గమే గాయత్రి. సర్వశక్తులను ప్రసాదించును.

దేవస్య : సర్వ ప్రాణులలోను ఆత్మరూపమున ప్రకాశించుచు, స్తుతింపబడుచు సర్వ వ్యాప్తమై యుండు దానిని దేవుడందురు.

ధీమహి : ధ్యానము చేయుటను ధీమహి అందురు. ధ్యానము బీజమైతే సాఫల్యము ఫలము.

ధీయః : ధీ = బుద్ధి, ధియః = బుద్ధులను ధర్మాల విషయమే బుద్ధి.

యః : ఎవడైతే లేక ఏదైతేయని అర్థము. ఇది పరమాత్మకు సంకేతము, ఆత్మ రూపము.

నః : పరమాత్మ నుండి మానవ సమాజమునకు సద్బుద్ధి లభించుట. బాహ్యాభ్యంతర లోకములందు సద్బుద్ధి విరాజిల్ల వలెనను ప్రార్థనా సూచకము. వసుధైక కుటుంబమను విశాలసద్బుద్ధి కలుగును.

ప్రచోదయాత్ : ప్రేరేపించుట, పెంపొందించుట యని అర్థము. గాయత్రీ ధ్యాన ఉద్దేశ్యము పరమాత్మను అందరకు సద్బుద్ధినీయమని ప్రార్థించుట. గాయత్రీ మంత్రమున ఈ ప్రచోదయాత్ మిక్కిలి ముఖ్యమైనది. ఇందాత్మ గౌరవము పరిపూర్ణముగా రక్షింపబడును. ఆత్మ దర్శనమునకు, బ్రహ్మ ప్రాప్తికి కావలసిన అంతః ప్రేరణ పరమేశ్వరుని కోరుటయే గాయత్రీ మంత్రంలోని పరమరహస్యం.

గాయత్రీమాత సర్వ దివ్యశక్తి స్వరూపిణి. ఇరువది నాలుగు బీజాక్షరములు గల మంత్రమగుటచే ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క దివ్య శక్తిచే విరాజమానమైయున్నది. 24 దివ్య శక్తుల గూర్చి ముఖ్యంగా తెలుసుకొందాము.

1) గాయత్రిని మించిన మంత్రం, తల్లిని మించిన దైవం లేదు. సర్వులకూ జగన్మాత ఆమెయే. ఈ మంత్రోచ్చారణచే సూక్ష్మ దేహమునందున్న శక్తి కేంద్రములనేకములు స్వయముగా మేలుకొని చైతన్యమును కలుగజేయును. మహర్షులు, మహాత్ములు దీర్ఘ కాల తపస్సుద్వారా సాధించినది అనతి కాలములో సాధింపనగును. ఈ 24 బీజాక్షరముల సహకారంతో గాయత్రీ మాతృ చరణారవింద సన్నిధిని పొందవచ్చును.

ఈ అక్షరముల వ్యాఖ్యానకర్త బ్రహ్మదేవుడు. విశ్వవ్యాప్తమైన విజ్ఞాన సర్వస్వమూ ఈ బీజాక్షరాల్లో నిక్షిప్తమైయున్నది. ఈ చతుర్వింశతి బీజాక్షరముల తత్త్వమును గ్రహింప గల్గిన తెలిసికొనదగిన దేదియూ ఉండదు. సర్వోత్కృష్టమైనది, సర్వ సాధకమైనది ఈ గాయత్రీ మహామంత్రరాజము.

2. తల్లిదండ్రుల రూపంలో గాయత్రీ దివ్యశక్తియే తన భక్తులను, ఉపాసకులను, అనుష్ఠానపరులను సదా సర్వదా కాపాడుచుండును.

3. దివ్యశక్తి స్వరూపిణియై పంచవదనాలతో, దశభుజాలతో తన భక్తులను

సదా సర్వకాల సర్వావస్థలయందు కాపాడుచుండును. ప్రణవ, వ్యాహృత మంత్ర స్వరూపిణి. పంచముఖములూ, పంచదేవతలకూ, పంచ జ్ఞానేంద్రియములకు, పంచ కర్మేంద్రియములకు, పంచకోశములకు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ) అనేక పంచకములకు ప్రతీకలై తత్త్వ రహస్య జ్ఞానమును తెలియజేయును. బ్రహ్మర్షులామెను పంచముఖిగా ఉపాసించి, దర్శించి, తరించారు. ప్రాపంచిక లాభా పంచకముగా ఆమె వామ భుజ పంచకమును, ఆత్మికమైన పంచలాభములుగా దక్షిణ భుజపంచకమును గ్రహింపబడినవి.

పది భుజములు సర్వ దిశలను తేజరిల్లజేసి సమున్నతముజేయును. సర్వశక్తి స్వరూపిణియైన ఆ దివ్యజనని దయకు పాత్రులైన వారికి తెలియని జ్ఞానముండదు.

4. బ్రాహ్మీశక్తి స్వరూపంతో అఖిలాండకోటి బ్రహ్మాండాలను సృష్టించుటయేగాక ఉపాసకులకు బ్రహ్మ విద్యనుపదేశించి అజ్ఞానాంధకారాన్ని తొలగిస్తుంది. దివ్యజ్ఞాన ప్రకాశములను వెదజల్లునట్టి భగవంతుని పరమసాత్త్విక శక్తినే 'బ్రహ్మవిద్య' లేక 'బ్రహ్మాణి' అని పిలుస్తారు. బ్రహ్మశక్తి అంతయూ బ్రాహ్మీదేవిలో నిగూఢమైయున్నది. బ్రహ్మకన్నా బ్రాహ్మీశక్తి అత్యంత మహత్తరమైనది. గాయత్రీ దేవిని 'బ్రాహ్మీ' యనికూడా అంటారు.

5. వైష్ణవీ శక్తి స్వరూపంతో నారాయణీ దేవిగా తేజరిల్లుతూ చరాచరప్రాణి కోటిని పోషిస్తూ వుంటుంది. పరమాత్మ యొక్క రజోగుణ స్వరూపమైన విష్ణుశక్తిని 'వైష్ణవి' యందురు. ఈమె పరమపోషక శక్తి.

6. శంకరీ దేవి (సంహారశక్తి) మహేశ్వరీ శక్తి స్వరూపిణియై దుష్టులను సంహరిస్తూ తన భక్తులకు రక్షణను కలిగిస్తూ గాయత్రీ దివ్యశక్తియే శుభాలను చేకూరుస్తుంది. అనవసరమైన వాటిని సంహరించి అవశ్యమైన వాటిని సంరక్షించు విశిష్ఠ గుణ సంపన్నమైన శివశక్తికే 'శాంకరీశక్తి' అనే దివ్యనామము గలదు. గాయత్రీ మాత యొక్క శాంకరీ స్వరూపాశయమును గ్రహించుట ద్వారా శంకరుని గుణ సర్వస్వమూ శాంకరీదేవివే అన్న విషయము అవగతమగును. ఆ దేవిని హృదయమారపిలవ గలిగిన

మొసలి బారి నుండి గజేంద్రుని రక్షించుటకు త్వరిత గతిని ఏ ఆయుధమూ ధరింపక తరలివచ్చిన విష్ణుమూర్తి వలె శాంకరీ దేవి మరుక్షణమే రయమున వచ్చి కాపాడునన్నది సత్యము.

7. దయాసముద్రురాలు (ఉద్ధరించే తల్లి) :

'అమ్మా'యని నిష్కపటంగా, నిరహంకారంగా శ్రద్ధా భక్తులతో పిలచిన చాలు దయా సముద్రురాలై భక్తులను సంకటాల బారి నుండి సంరక్షించి దయాశక్తిని నిరూపించి ఉద్ధరిస్తుంది. శ్రీరాముని కరుణా విశేషముచే లంకానగరాన్ని సర్వంనాశనం చేసిన వానర సమూహము వలె ఆ తల్లి అనుగ్రహశక్తిచే మనలోని శత్రు సమూహాన్ని నిర్జించవచ్చును.

8. సద్గురు స్వరూపిణి (సద్గురు ప్రాప్తి) : విశుద్ధాంతఃకరణతో, వినయ భావంతో ఆరాధించిన సద్గురు రూపంలో జ్ఞాన మార్గాన్ని భోదించడానికి విజయం చేసేది గాయత్రీ దివ్యవక్తియే. ధృవునికి దేవర్షియగు నారదుని వలన దివ్యమైన మహత్తర పథము అనగా భగవదాశ్రయము లభించిన విధంగా జగన్మాత కరుణా కటాక్షములు లభించిన సత్య సహాయకుడు అనగా సన్మార్గ ప్రవర్తకుడైన గురుశ్రేష్ఠుడు సునాసాయముగా లభించగలడు.

9. పాపఘ్ని : నిర్మలాంతః కరణతో స్మరించిన పాపాలన్నిటినీ రూపుమాపుతుంది. గాయత్రీ దివ్యశక్తి ఆరాధనవలన సద్గుణములు వర్ధిల్లును. తత్ఫలితంగా దుర్గుణాలు గబ్బిలాలవలె, కాకుల వలె పలాయన మంత్రము పఠించును. తద్వారా మానసిక శాంతి లభిస్తుంది.

10. సద్గుణ ప్రదాయిని : గాయత్రీ దివ్యశక్తిని లోక కళ్యాణ దృష్ట్యా ఆరాధించే వారికి ఆ తల్లి సద్గుణ సర్వస్వాన్నీ ప్రసాదిస్తుంది. అనగా కరుణ, సేవ, సంయమనము, సత్యము, స్ఫూర్తి, శౌర్యము, ప్రేమ మున్నగునవి. దివ్య శాంత్యానందములు లభించును.

11. ఉన్నతపథ ప్రదాయిని : అమ్మ అనుగ్రహంతో అల్ప వ్యవధిలో సాధకుడు దివ్యసోపాన పరంపరల నధిగమించి మహోన్నత స్థానాన్ని పొందగలుగుతాడు.

జీవిత లక్ష్యమైన ఉన్నత స్థానాన్ని చేరగలుగుతాడు.

12. పాశ విమోచని : గాయత్రీ దివ్య శక్తి నారాధించిన జన్మ జన్మాంతరాల కర్మపాపాల నుండి విముక్తిని కలిగిస్తుంది. వల నుండి ముక్తి పొందిన పక్షి కన్నా మిన్నగా మహానందము లభిస్తుంది.

13. ప్రారబ్ధ వినాశిని : స్వార్థాన్ని విడనాడి గాయత్రీ దివ్యశక్తి నారాధించిన జగన్మాత వారివారి ప్రారబ్ధాలను కూడా నాశనం చేస్తుంది.

14. అనేక ప్రలోభములు : గాయత్రీ దివ్యశక్తి సాధకుణ్ణి నిజ సన్నిధికి చేర్చుకోవడం కోసం అనేక ప్రలోభాలు చూపి క్రమంగా తనలో లీనం చేనుకుంటుంది. సిద్ధుల ప్రలోభాకర్షణ, సౌందర్యాదులను ఉపేక్షాభావముతో చూచునట్టి దివ్యశక్తిని జగదంబ గాయత్రీ దేవి ప్రసాదిస్తుంది. అపుడు ఆధ్యాత్మిక శక్తులన్నియు సహకరించి సంపూర్ణత్వము సిద్ధిస్తుంది.

15. శారీరక క్లేశ విముక్తి : తన మంత్రాన్ని జపించే అనుష్ఠాన పరాయణుల అధి వ్యాధులను గాయత్రీ దివ్యశక్తి దూరం చేస్తుంది. శారీరక వ్యాధులను కూడా దూరీకృతం చేసి సాధనకుపకరించు శక్తి.

16. జ్ఞాన ప్రదాయిని శ్రీ సరస్వతీ దేవి : విద్యాధిష్ఠాన దేవతా స్వరూపిణియైన సరస్వతీ స్వరూపిణియై తన భక్తులకు సముచిత విద్యలను ప్రసాదిస్తుంది. శ్రీ గాయత్రీ దివ్యశక్తికి త్రివిధములైన రూపములున్నవి. సరస్వతిని 'హ్రీం' అనియు, మహాలక్ష్మిని 'శ్రీం' అనియు, కాళికాదేవిని 'క్లీం' అనియు పిలుచుదురు. హ్రీం బీజరూపిణియైన సరస్వతీ రూపంలో సాధకుని హృదయాంతరాళమున జ్ఞాన స్వరూపంతో వీణాపాణి ప్రవేశించును. సరస్వతీ శక్తి ఉపాసనకు శక్తిని ప్రసాదించును. శుద్ధ బుద్ధినిచ్చును. క్షీరనీర వివేకము గల సమశక్తినీ ప్రసాదించును.

ధీతత్త్వోపాసనా ప్రాముఖ్యము అధికముగానున్న గాయత్రీ మంత్ర రాజమిది. అనగా బుద్ధిజనిత మాలిన్యము దూరమగును. ముఖ్యంగా మేధస్సుతో

కృషి చేయువారి మార్గం నిష్కపటంగా, నిరాటంకంగా కొనసాగుతుంది. శుద్ధ, సద్బుద్ధుల ప్రసాదిస్తుంది.

17. మహైశ్వర్యప్రదాయిని శ్రీ మహాలక్ష్మి : తన భక్తులకు మహాలక్ష్మి స్వరూపిణియై సమస్త సంపదలనూ ప్రసాదించి కాపాడుతుంది. శ్రీం బీజస్వరూపిణియైన మహాలక్ష్మి దేవి కృషి చేయువారికి కరుణతో సకలైశ్వర్యాలు సిద్ధింపజేస్తుంది. భగవత్ వరప్రసాదమైన ఈ ఐశ్వర్యాన్ని సత్కార్యాలకే వినియోగించవలెను.

పరమార్థ దృష్టితో, ఉదారస్వభావముతో గాయత్రీ దివ్య శక్తి నారాధించు వారికి ధనాభావము లేక అమిత ఆనందాన్ని కటాక్షిస్తుంది.

18. భయంకర శత్రువుల నుండి సంరక్షణ : గాయత్రీ దివ్యశక్తి రుద్రాణీ రూపంలో క్రూర రాక్షసాదుల బారి నుండి తన భక్తులను కాపాడుతుంది. సంహార బీజమైన క్లీం శక్తి కాళి, దుర్గ, చండి, ఆదిగాగల నామాలతో పిలుపవబడి స్వభక్తజన సంరక్షణార్థము దుష్ట సంహారము చేస్తుంది. ద్వేష, కలహ, సంఘర్షణముల స్థానంలో ప్రేమ, శాంతి, సహకారములనుత్పన్నము చేయుటయే తల్లి కరుణాకటాక్ష వీక్షణముల మహత్తర దివ్య ప్రబావమైయున్నది.

19. **అదృష్ట సహకార ప్రదాయిని :** నిజాంతః కరణతో ధ్యానించే భక్తులకు గాయత్రీ దివ్యశక్తి అగోచరంగా వుండియే సకాలంలో సహకరిస్తుంటుంది. ఆ దివ్య జనని సహకార, అనుగ్రహాదులు లభించిన కోరదగినదింకేమి వుంటుంది!

20. **ఆనందప్రద దాంపత్య జీవన ప్రదాయిని :** గాయత్రీ దివ్యశక్తి విశేషానుగ్రహించే దాంపత్యము కూడా ఆనంద ప్రదమవుతుంది. పూర్వము ఋషులు, మునులు కూడా సపత్నీ సమేతంగానే తపస్సు చేసెడివారు. గృహస్థాశ్రమమే ఆశ్రయములన్నిటిలోను మేలైనది, శ్రేష్ఠమైనది. మిగిలిన ఆశ్రమాలకు సహాయ కారిగా వుంటుంది. దంపతులు ఆత్మీయతా బంధన బంధితులై ధర్మబద్ధముగా జీవన యాత్రను కొనసాగించెదరు. వారి జీవితములూ పునీతమవుతాయి.

21. **సత్సంతాన భాగ్యప్రదాయిని :** సత్సంతానాన్ని ప్రసాదిస్తుంది. ఆమాత కృపచే వారు సన్మార్గమున చరించెదరు.

22. **పారివారిక శాంత్యానంద ప్రదాయిని :** ఆనంద స్వరూపిణిగా శాంతిని, ఆనందాన్ని ప్రసాదిస్తుంది.

23. **పరమప్రేమాస్పద స్వరూపిణి :** కరుణ, సేవా ధర్మము గల వారికి తన పరమ ప్రేమను వర్షిస్తుంది.

24. **జీవన్ముక్తి ప్రదాత్రి :** నిర్మల చిత్తంతో ఆరాధించువారికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఊర్ధ్వగతికై చేయుసాధనలన్నిటిలోను గాయత్రీ దివ్య శక్తి సాధన పరమోత్కృష్టమైనది. గాయత్రీ కృపావిశేషముచే అత్యల్ప ప్రయాసతో జీవుడు స్వల్ప వ్యవధిలోనే తరించగల్గుతాడు.

ఈవిధంగా అనేక దివ్యశక్తులతో లౌకికంగా, పారమార్థికంగా తన భక్తులను సర్వ విధాలా, సర్వవేళలా, బ్రోచుతుంది.

గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాలలో ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క దేవతకు ప్రతినిధియై ఇరువది నాలుగు దేవతల శక్తి కలిగియున్నది. వాని గూర్చి ఈ విధంగా స్పష్టీకరించబడినది.

1. త : ఈ ప్రథమాక్షరానికి గణేశుడధిదేవత. ఓం ఏకదంష్ట్రాయవిద్మహే, వక్రతుండాయ ధీమహితన్నో బుద్ధిః ప్రచోదయాత్ అనేది గణేశగాయత్రి. కార్యసిద్ధికి తొలుత పూజింపదగినవాడు గణేశుడు. గాయత్రి యొక్క మొదటి అక్షరం పలుకుట వలననే మనము గణాధిపతిని సేవించిన వారమయి ఆయన అనుగ్రహమున కార్యసిద్ధిని, బుద్ధి శక్తిని పొందగల్గుతాము. శ్రేష్ఠ జ్ఞానాన్ని పొందుతాము.

2. త్స ఈ రెండవ అక్షరానికి అధిష్ఠాన దేవత శ్రీ నృసింహస్వామి. 'ఓం ఉగ్రనృసింహాయ విద్మహే వజ్ర నఖాయ ధీమహి తన్నో నృసింహః ప్రచోదయాత్ అన్నది నృసింహ గాయత్రి. పరాక్రమము, జయము సిద్ధించి శత్రుం జయులమౌతాము. దీని వలన మన ఉపపాతకములన్నీ నశిస్తాయి.

3.వి ఈ మూడవ అక్షరానికి విష్ణువు అధి దేవత. పాలనాశక్తికి అధిష్ఠాత, జీవరక్షకుడు. ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహితన్నో విష్ణుః ప్రచోదయాత్ అనేది విష్ణు గాయత్రి. దీని ద్వారా ఆ జగత్పోషకుని అనుగ్రహం పొంది మనం బ్రతికి, తోటి వారిని పోషించే శక్తిని పొందగల్గుతాము. దీని వలన మహాపాతకాలు కూడా తొలగిపోతాయి.

4 తుః ఈ నాల్గవ అక్షరానికి శివుధదిపతి, దేవత. కళ్యాణ శక్త్యాధికారి. 'ఓం పంచవక్త్రాయ విద్మహే మహాదేవాయ ధీమహితన్నోరుద్రః ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. దుష్ఠ గ్రహదోషములు తొలగిపోతాయి. దీని వలన ఆత్మశక్తి పెరుగుతుంది. అరిష్టముల నుండి, పతన స్థితుల నుండి రక్షణ ఏర్పడి శుభ పరంపర చేకూరుతుంది.

5. వ శ్రీ కృష్ణుడు ఈ ఐదవ అక్షరానికి అధిష్ఠాత. యోగ శక్తికి అధిష్ఠాత. యోగ శక్తికి అధిష్ఠాతయై యోగాన్ని ప్రసాదిస్తాడు. 'ఓం దేవకీ నందనాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నోకృష్ణః ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. భ్రూణ హత్యా పాతకముల నుండి రక్షణ చేకూరుతుంది. వైరాగ్య జ్ఞానములను ప్రసాదిస్తుంది.

6. రే రాధాదేవి దేవతగా ఈ ఆరవ అక్షరానికి అధిష్ఠాత్రియై వెలసియున్నది. ప్రేమశక్తికి అధికారిణి. యధార్థప్రేమశక్తిని కలుగజేసి అసూయ, ద్వేష భావాదులను దూరం చేస్తుంది. 'ఓం వృష భామజాయ విద్మహే, కృష్ణ ప్రియాయై, ధీమహి తన్నో రాధా ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. పాపములన్నిటినీ నశింపజేస్తుంది.

7.ణ్యం : ఈ ఏడవ అక్షరానికి లక్ష్మీదేవి అధిష్ఠాత్రి. సమస్త సందపలను సంప్రాప్తింపజేస్తుంది. 'ఓం మహాలక్ష్మ్యైచ విద్మహే విష్ణు ప్రియా యైధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి.

8.భ ఈ ఎనిమిదవ అక్షరానికి అధిష్ఠాన శక్తి అగ్ని. 'ఓం మహాజ్వాలాయ విద్మహే అగ్నిజ్వాలాయ ధీమహి తన్నో అగ్నిః ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. దీని వలన బ్రహ్మ హత్యాపాతకం కూడా నశిస్తుంది. గొప్ప తేజస్సు, శక్తి

సామర్థ్యాలు సమకూరుతాయి.

9.ర్గః ఇంద్రుడు రక్షాశక్తికి అధిష్ఠాత. 'ఓం సహస్ర నేత్రాయ విద్మహే వజ్రహస్తాయ ధీమహి తన్నో ఇంద్రః ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. ఇది పురుష హత్యాపాతకాన్ని పోగొట్టగలదు. రోగములు, శత్రువులు, భూతప్రేతాదుల నుండి రక్షించును.

10.దే సరస్వతి ఈ అక్షరానికి అధిదేవత : జ్ఞానదేవత ప్రదాయిని. 'ఓం సరస్వత్యై విద్మహే బ్రహ్మ పుత్ర్యై ధీమహి తన్నో దేవి ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. ఇది గోహత్యా పాతకాన్ని పోగొట్టును. జ్ఞానము, వివేకము, సూక్ష్మబుద్ధి, సదాలోచనములను ప్రసాదించును.

11.వ దుర్గాదేవి అధిదేవత. 'ఓం గిరిజాయై విద్మహే శివ ప్రియాయై ధీమహి తన్నో దుర్గా ప్రచోదయాత్' అనేది మంత్రగాయత్రి. స్త్రీ హత్యా దోషాన్ని కూడా పోగొట్ట గలది. సకల విఘ్నములను, శత్రువులను అంతంగావించి సకల శక్తి, సామర్థ్యాలు ప్రసాదించును.

12.స్య అధిదేవత హనుమంతుడు. 'ఓం అంజనాసుతాయ విద్మహేవాయుపుత్రా ధీమహితన్నో మారుతిః ప్రచోదయాత్' అనేది మంత్ర గాయత్రి. ఇది కూడా స్త్రీ హత్యాదుల పాపాన్ని పోగొట్టగలది. భక్తి, నిష్ఠ, కర్తవ్య పరాయణత, నిర్భయత్వ, బ్రహ్మచర్య పాలనా శక్తులనొసంగును.

13.ధీ 'పృథ్వీదేవి (భూమాత) అధిదేవత. ధారణాశక్తికి దేవత. 'ఓం పృథ్వీదేవ్యై, విద్మహే సహస్రమూర్త్యై ధీమహితన్నో పృథ్వీ ప్రచోదయాత్' అనేది మంత్ర గాయత్రి. ప్రాణులకు గంభీరత్వాన్ని, క్షమాశీలత్వాన్ని, ధైర్యాన్ని, ధృఢత్వాన్ని, సహిష్ణుతను, ధారవాహకతను, నిరంతరత్వాన్ని ప్రసాదిస్తుంది.

14.మ సూర్యుడు అధిదేవత. 'ఓం భాస్కరాయ విద్మహే దివాకరాయ ధీమహితన్నో సూర్యః ప్రచోదయాత్' అన్నది సూర్యగాయత్రి. ఈ అక్షర శక్తి వలన ఆరోగ్యము, దీర్ఘ జీవనము, ప్రాణశక్తి, వికాసము, తేజస్సు, ఉష్ణత్వము లభిస్తాయి.

15.హి రాముడు అధిదైవం. 'ఓం దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి

తన్నో రామః ప్రచోదయాత్' అనేది రామగాయత్రి. ఈ అక్షరం పూర్వజన్మార్జిత పాపాలను పోగొట్టుతుంది. దీని వలన ధర్మము, శీలము, సౌమ్యత, మైత్రి, ప్రేమ వంటి ఉత్తమ లక్షణాలు పెంపొందుతాయి.

16.ధి సీతాదేవి అధిదేవత. తపశ్శక్తికి అధిష్ఠాత్రీ దేవి. 'ఓం జనకనందిన్యై విద్మహే భూమిజాయై ధీమహితన్నో సీతా ప్రచోదయాత్' అనేది సీతా గాయత్రి. అశేష పాపసమూహాన్ని పోగొట్ట గల ఈ అక్షరం వలన తపశ్శక్తి, పవిత్ర్యత, ఆధ్యాత్మికోన్నతి చేకూరుతాయి.

17.యో చంద్రుడు అధిదేవత. శాంతి శక్తికి అధిష్ఠాన దేవత. 'ఓం క్షీరపుత్రాయ విద్మహే అమృతత్త్వాయ ధీమహి తన్నో చంద్రః ప్రచోదయాత్' అనేది చంద్రగాయత్రి. ఇది ప్రాణివధ గావించిన పాపాలను పోగొట్టుతుంది. మానసిక అశాంతిని తొలగించి చింత, క్రోధం, నిరాశ, క్షోభ వంటి భావాలనుండి రక్షించి, చిత్తశాంతిని చేకూరుస్తుంది.

18.యో యముడు దేవత. 'ఓం సూర్య పుత్రాయ విద్మహే మహాకాలాయ ధీమహి తన్నో యమః ప్రచోదయాత్' అనేది యమగాయత్రి. దీని వలన దానములు స్వీకరించుట వలన కలుగు పాపములు తొలగిపోతాయి. కాలము యమాధీనం కాబట్టి కాలమును సద్వినియోగం గావించుకొను శక్తి, మృత్యువునకు వెరవని శక్తి, జాగరూకత సంప్రాప్తిస్తాయి.

19.నః ఈ అక్షరానికి దేవత బ్రహ్మ. సృష్టి శక్తికి అధిష్ఠాత. 'ఓం చతుర్ముఖాయ విద్మహే హంసారూఢాయ ధీమహి తన్నో బ్రహ్మ ప్రచోదయాత్' అన్నది బ్రహ్మ గాయత్రి. దీని వలన సృజనాత్మక శక్తి అభివృద్ధి చెందుతుంది. సకల పాపముల నుండి విముక్తి కలుగును.

20.ప్ర వరుణుడు ఈ ఇరువదవ అక్షరానికి ప్రధాన దేవత. రస శక్త్యాధికారి. 'ఓం జలబింబాయ విద్మహే నీలపురుషాయ ధీమహి తన్నో వరుణః ప్రచోదయాత్' అనేది వరుణ గాయత్రి. దీని వలన ఈశ్వర ప్రాప్తి, సరసత్వము, దయాళు స్వభావము, ఆనందానుభూతులు కలుగుతాయి.

21.చో నారాయణుడు ఈ అక్షరానికి దేవత. 'ఓం నారాయణాయ విద్మహే

వాసుదేవాయ ధీమహితన్నో నారాయణః ప్రచోదయాత్ అనేది నారాయణ గాయత్రి. దీని వలన విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. దివ్య గుణములు, ధర్మ బుద్ధి, సచ్ఛీలము, సచ్చరిత్రత, శ్రేష్ఠత్వము సిద్ధించును.

22.ద ఈ ఇరువది రెండవ అక్షర దేవత శ్రీ హయగ్రీవుడు సాహస శక్తి ప్రదాత. 'ఓం వాణీశ్వరాయ విద్మహే హయగ్రీవాయ ధీమహి తన్నో హయగ్రీవః ప్రచోదయాత్' అన్నది హయగ్రీవ గాయత్రి. దీని వలన రుద్రపదము. చేకూరుతుంది. సాహసము, ఉత్సాహము, నిర్భయము, సకల పురుషార్థము సమకూరుతాయి.

23.యా హంస దేవత అధిష్ఠాన శక్తి. వివేక శక్తికి అధిష్ఠాత. 'ఓం పరమహంసాయ విద్మహే హంసాయ ధీమహి తన్నో హంసః ప్రచోదయాత్' అన్నది హంస గాయత్రి. దీని వలన బ్రహ్మపదప్రాప్తి కలుగుతుంది. హంసక్షీర, నీరవివేకం జగత్ప్రసిద్ధి, సదసద్వివేకము, దూరదర్శిత్వము, గొప్ప యశస్సు, సత్సంగతి, ఉత్కృష్టాహారము, ఉజ్జ్వల యశస్సంతోషాధిగుణాలు లభ్యమవుతాయి.

24.త్ ఈ ఇరువది నాల్గవ అక్షరానికి దేవత తులసి. సేవాశక్తికి అధికారిణి. 'ఓం శ్రీ తులస్యై విద్మహే విష్ణు ప్రియాయై ధీమహితన్నో బృందా ప్రచోదయాత్' అనేది తులసీ గాయత్రి. ఈ అక్షర శక్తి వలన త్రిమూర్తుల అనుగ్రహం కలుగుతుంది. సేవాభావము, సత్కార్య ప్రేరణ, పరదుఃఖ నివారణ, ఆత్మశాంతి, నిష్ఠ, పవిత్రత వంటివి సమకూరుతాయి.

ఇరువది నాలుగు గంటల రోజు కూడా వెలుగు, చీకటుల సమత్వాన్ని ప్రవచిస్తుంది. దత్తాత్రేయులు కూడా ప్రకృతిలోని ఇరువది నాలుగు విషయాలను గురువులుగా భావించి వాటినుండి జ్ఞానాన్ని పొందాడన్నది గమనింపవలసిన విషయం. ఆ గురువుల పేర్లివి. 1) భూమి, 2) వాయువు, 3) ఆకాశము, 4) జలము, 5) అగ్ని, 6) చంద్రుడు, 7) సూర్యుడు, 8) పావురము, 9) కొండచిలువ, 10) సముద్రము, 11) మిడుత, 12) తేనెటీగ, 13) ఏనుగు, 14) తేనెతీయు వాడు, 15) లేడి, 16) చేప, 17) పింగళయను వేశ్య, 18) కురర పక్షి, 19) బాలుడు, 20) కన్య, 21) బాణము తయారు చేయువాడు, 22) పాము, 23) సాలీడు, 24)

కీటకము. కేశవ నామాలు కూడా ఇరువది నాలుగు. ఒక్కో నామం ఒక్కో విశిష్టత కలిగియున్నది. ఈ విధంగా ఈ సంఖ్యకు ప్రాశస్త్యమున్నది.

సృష్ట్యాదిలో నారాయణుడు నారదుని గాయత్రీ సహస్ర నామావళిని సద్గతి ప్రాప్తికి, మోక్ష ప్రాప్తికి ఉపదేశించియున్నాడు. ఇందు హల్లులు, బీజాలుగాను, అచ్చులు శక్తులుగాను, బ్రహ్మఋషిగాను, ఛందస్సు అనుష్టుప్పుగాను, దేవతగాయత్రీ దేవిగాను దేవీ భాగవత మహాపురాణము నందు చెప్పబడియున్నది.

భగవద్గీత, శివగీత, రామగీత, దేవగీతాది అనేక గీతాల రూపాల్లో తేజరిల్లుతూ జ్ఞాన మార్గాన్ని గాయత్రీ మంత్రం బోధిస్తుంది. గంగారూపిణిగా సర్వ మానవ కోటిని సంరక్షించి తరింపజేయు చల్లని తల్లి గాయత్రీ మాత. ఓ చేత ఖడ్గం, మరో చేత ఖండిత శిరస్సును ధరించి దుష్టులకు సింహస్వప్నంగాను, శిష్టులకు కరుణామయిగాను విరాజిల్లుతూ భక్తుల బ్రోచు ఛిన్న మస్తాదేవిగా కూడా గాయత్రీమాత సకలలోక వంద్యురాలు. ఉదయమున బాలయని, మధ్యాహ్నమున యువతి యని, సాయంకాలమున వృద్ధయని మునులు గాయత్రిని కీర్తింతురు. అంతియేగాక గంగా, యమున, విశాపాది నదులన్నియూ ఆమె రూపమే. సర్వమూ ఆమెయే. సర్వ రూపములు ఆ తల్లివే.

గాయత్రీ మంత్ర మహిమను గూర్చి ప్రాచీనకాలమందు ఈ కాలమందు పలు గ్రంథాలు, పలువురు మహాత్ములు వెల్లడించిన అమృత వచనాల్లో కొన్నిటిని ఇక్కడ ప్రకటితం చేయడం జరిగింది. ముందుగా ప్రాచీన కాలమందు వెల్లడించినవి ఈ విధంగా ఉన్నాయి.

**విశ్వామిత్రుడు :**

గాయత్రీ మంత్రంతో సమానమైన మంత్రం నాలుగు వేదాల్లోనూ లేదు. సంపూర్ణ వేద, యజ్ఞ, దాన తపాదులు గాయత్రీ మంత్రంలోని ఓ కళకు కూడా సమానం కాజాలవు.

**మనుస్మృతి :**

బ్రహ్మదేవుడు మూడు వేదాల సారంతో మూడు పదాలుగల గాయత్రి

మంత్రం సృష్టిచేశాడు. గాయత్రిని మించి పవిత్రం చేయునట్టి అన్య మంత్రమేదియూ లేదు. నియమబద్ధంగా మూడు సంవత్సరాలు జపించునట్టివాడు భగవంతుణ్ణి పొందగల్గుతాడు. ఇతర సాధనాలు చేయకున్నను రెండు సంధ్యలలోను గాయత్రిని జపించిన వేదాధ్యయన ఫలాన్ని, గాయత్రీ జపసిద్ధిని పొందగల్గుతాడు.

**యజ్ఞవల్క్యుడు :**

గంగతో సమానమైన తీర్థమేదియూ లేదు. కేశవుణ్ణి మించిన శ్రేష్ఠ దేవుడు లేడు. గాయత్రిని మించిన శ్రేష్ఠ మంత్రం నేటివరకూ లేదు. ఇకముందు రాదు. సమస్త వేదాల సారమూ, ఉపనిషత్తులైతే, ఉపనిషత్సారము గాయత్రీ మంత్రమై యున్నది.

**పరాశరుడు :**

సమస్త జప, సూక్త, వేద మంత్రాలలో గాయత్రీ మంత్రమే పరమ శ్రేష్ఠమైనది.

**శౌనకుడు :**

ఇతర ఉపాసనలు చేయకున్నను ద్విజులు కేవలం గాయత్రీ జప మాత్రంచే బంధన ముక్తులవుతారు. భౌతిక, పార లౌకిక సుఖాలను పొందుతారు.

**గాయత్రీ మంత్ర సిద్ధిని పొందిన వశిష్ఠుడు :**

మందమతి, దుర్మార్గగామి, అస్థిరబుద్ధి కలవాడు కూడా గాయత్రీ ప్రభావమున సర్వోన్నత పదవిని పొందగలడు. సద్గతిని అవశ్యం అందుకుంటాడు. పవిత్రంగా స్థిరత్వంతో గాయత్రిని జపించుతూ ఉపాసించునట్టివాడు ఆత్మబోధ లాభాన్ని పొందుతాడు.

**నారద దేవర్షి :**

గాయత్రి భక్తి స్వరూపమే. భక్తి రూపమైన గాయత్రి ఉన్న పవిత్ర స్థానంలో శ్రీమన్నారాయణుడు కూడా ఉంటాడనడంలో సందేహం ఏమాత్రం లేదు.

**వేదవ్యాస మహర్షి :**

పుష్పసారం మధువైనట్లు, క్షీరసారం ఘృతమైనట్లు, సమస్త వేదముల సారము గాయత్రియై తేజరిల్లుచున్నది. సిద్ధిచేసిన గాయత్రీ మంత్రం కామధేను సదృశమైనది. గంగానది శారీరక పాపాలను ప్రక్షాళన చేస్తుంది. గాయత్రీ రూపమైన బ్రహ్మగంగ వలన ఆత్మయే పవిత్రమవుతుంది.

**అత్రి మహర్షి :**

ఆత్మను శోధించునట్టి పరమ మంత్రము గాయత్రి. దాని ప్రతాపము వలన కఠినతలు, దోష, దుర్గుణాలు క్షాళనమైపోతాయి. గాయత్రీ తత్త్వాన్ని చక్కగా గ్రహించ గల్గునట్టి విద్వాంసులకు ఈ విశ్వంలో సుఖాలేవీ శేషించియుండవు.

**భరద్వాజ మహర్షి :**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలు కూడా గాయత్రి జపం చేస్తుంటారు. అది పరబ్రహ్మసాక్షాత్కారం చేయిస్తుంది. అధర్మ కర్మలు చేయునట్టి వారి దుర్గుణాలన్ని గాయత్రీ శక్తి కృపవల్ల దూరమవుతాయి.

**అధర్వణ వేదం :**

గాయత్రీ మంత్రం ఆయుర్ధాయాన్ని, ప్రాణశక్తి, కీర్తి సాధన, బ్రహ్మ తేజుస్సులను ప్రసాదించుతుంది.

ఇదే విధంగా ప్రాచీన కాలంలోని పలుధార్మికగ్రంథాలు, మహాత్ములు గాయత్రీమంత్ర ప్రాశస్త్యం గూర్చి వెల్లడించడం జరిగినది.

ఇపుడాధునికకాలంలోని పలువురు మహానుభావులు వెల్లడించిన అభిప్రాయాల్లోని కొన్ని సుధాబిందువుల నీవిధంగా ఆస్వాదిద్దాం :

**స్వామి రామకృష్ణ పరమ హంస :**

దీర్ఘ సాధనాలు విడనాడి గాయత్రీ సాధన చేసిన మహత్తరసిద్ధులు లభిస్తాయి. ఈ మంత్రం చిన్నదైనా దీని శక్తిమాత్రం మహత్తరమైనది. అమ్మదయవుంటే అన్నీ ఉన్నట్లే. కనుక సదా అమ్మపాదాలనాశ్రయించి నిర్భయంగా ఉండండి.

**రామతీర్థ స్వామి :**

రాముణ్ణి పొందడం జీవితంలో పొందవలసిన మహత్తర కార్యం పవిత్రాంతఃకరణగలవాడు రాముణ్ణి పొందగల్గుతాడు. గాయత్రిని అనుష్ఠించడం వలన కామునికంటె రాముడు సర్వశ్రేష్ఠుడన్న భావం స్థిరమవుతుంది.

**వివేకానందస్వామి :**

మహారాజును అతని గౌరవానికనుకూలమైన వస్తువునేయాచించాలి.

పరమాత్మను అర్థించవలసిన వస్తువు సమృద్ధి. దీని వలన సన్మార్గంలో ప్రగతి కలుగుతుంది. సత్కర్మలవల్ల సర్వసుఖాలు లభిస్తాయి. సత్ అంటే దైవంవైపు పురోగమించుట. అట్టి వారికి ఎట్టి సుఖాలకూ లోటుండదు. గాయత్రీమంత్రం సమృద్ధి మంత్రం అందుకేదీనికి మంత్రకుటమని ఖ్యాతి వచ్చినది.

**జగద్గురు శంకరాచార్యులవారు :**

గాయత్రీ మహిమను అభివర్ణించి పొల్చజాలము. సద్బుద్ధివల్ల ఆత్మ ప్రాప్తికి సంబంధించిన దివ్యదృష్టి కలుగుతుంది. అది గాయత్రి ద్వారానే లభిస్తుంది. అది దుష్టులను సంహరించి శిష్టులను సంరక్షించడానికే అవతరించింది.

**రమణ మహర్షి :**

యోగ విద్యాంతరమైన యంత్రవిద్య మహత్తర ప్రబలమైనది. ఐహిక, లౌకిక సుఖాలు రెండూ గాయత్రీ మంత్రం వల్ల లభిస్తాయి.

**స్వామి శివానంద :**

బ్రహ్మ ముహూర్తంలో గాయత్రిని జపించడం వలన చిత్తశుద్ధి కలుగుతుంది. హృదయం నిర్మలంగా ఉంటుంది. శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. స్వభావంలో నమ్రత్వం ఏర్పడుతుంది. బుద్ధి సూక్ష్మం కావడం వలన దూరదృష్టి కలిగి స్మరణ శక్తి వర్ధిల్లుతుంది. కఠిన పరిస్థితులలో గాయత్రి ద్వారా సహకారం లభించి ఆత్మదర్శనం కలుగుతుంది.

**శ్రీ దయానంద స్వామీజీ :**

గాయత్రీ మంత్రం సర్వోత్కృష్టమైనది. చతుర్వేదాలకూ మూలమైన గురుమంత్రం. ఆది కాలం నుండీ ఋషులు, మునులు అందరూ దీనినే జపించేవారు.

**యోగి అరవింద ఘోష్ :**

గాయత్రిలో సన్నిహితమైయున్న శక్తి మహత్తర కార్యాన్ని సాధిస్తుంది. సాధనా మార్గానికి గాయత్రీ మంత్రోపదేశాన్ని అనేక మందికి చేశారు.

**రవీంద్రనాథ్ ఠాగూర్ :**

ఒకే ఒక శ్వాసలో సరళంగా ఉచ్చారణ చేయగలవారు గాయత్రీ మంత్రం

ద్వారా భారతదేశంలో జాగరణచేయవచ్చును. ఈ పవిత్ర మంత్ర సాధనలో ఏవిధమైన తార్కిక ఊహాపోహలు, మత భేదాలు అవసరం లేదు.

**లోకమాన్య బాలగంగాధర తిలక్ :**

అనేక విధాలైన దాస్య శృంఖలాలతో బంధింపబడిన భారతీయ ప్రజ ముక్తిని పొందాలంటే రాజకీయ, నైతిక సంఘర్షణలవల్ల జరగదు. దానికై ఆత్మలో ప్రకాశాన్ని కలిగింపజెయ్యాలి. తద్వారా సదసద్వివేకం కలుగుతుంది. దుర్మార్గం నుండి శ్రేష్ఠ మార్గం మీద పురోగమించాలన్న ప్రేరణ కలుగుతుంది. ఈ భావనయే గాయత్రీ మంత్రంలో విద్యమానమై యున్నది.

**గాంధీజీ :**

స్థిరశాంత చిత్తంతో గాయత్రీ మంత్రానుష్ఠానం చేయడం వలన ఆపదలు, సంకటాలు, సమస్త రోగాలు దూరమై ఆత్మోన్నతి సిద్ధిస్తుంది.

**శ్రీ మదన మోహన్ మాలవ్యా :**

భౌతికమైన అభావాలను దూరంచేసి బుద్ధిని పవిత్రం చేస్తుంది. ఆత్మలో పరమాత్మ ప్రకాశం కలుగుతుంది. గాయత్రిలో ఈశ్వర పరాయణత్వ భావాలను ఉత్పన్నం చేసే దివ్యశక్తి ఉన్నది.

**డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ :**

మనలో పునః జీవన స్రోతస్సును ప్రభావింపజేయగల ప్రార్థనయే గాయత్రీ ప్రార్థన.

**ప్రసిద్ధ ఆత్మజ్ఞాని శ్రీ టి. సుబ్బారావు :**

సవితా నారాయణుని దైవీ ప్రకృతిని 'గాయత్రి' అంటారు. ఆదిశక్తి కావడం వలన గాయత్రి అనబడుతుంది. ఆదిత్య వర్ణనయని భగవద్గీతలో వర్ణన చేయబడియున్నది. గాయత్రిని ఉపాసన చేయుట యోగం సర్వ ప్రథమాంగమైయున్నది.

ఈవిధంగా అనేకమంది విద్వాంసులు, ఉపాసకులు, మహానుభావులు

గాయత్రి వైశిష్ట్యాన్ని చెప్పియున్నారు. గాయత్రి వాస్తవానికి ఓ అద్భుతశక్తి. ప్రోతస్సు లేదా సాధన అవుతుంది. గాయత్రీ మంత్రం సర్వశ్రేష్ఠ మంత్రరాజమై తేజరిల్లుతున్నది.

**గాయత్రీ మంత్ర ముఖ్య సందేశము :**

గుహాశయే బ్రహ్మ హతాశనే అహంకర్తి దమం శాఖ్య హవిః హతం సత్ విలీయతే న ఇదమ్ అహం భవాన్ ఇతిఏష ప్రకారః తు అభిధీయతే అత్రయదస్తి యద్భాతి తదాత్మ రూపం న అన్యత్ తతః భాతినచ అన్యదస్తి, స్వభావ సంవిత్ ప్రతిభాతి కేవలా గ్రాహ్యం గ్రహీతా ఇతి మృషాఏవకల్పనా !

మన బుద్ధి గుహలో దాగిన బ్రహ్మమనెడి అగ్నితో అహంకారము అనగా నేను చేయుచున్నాను అను భావము మరియు 'నిదంబుద్ధి' అనగా ఇది నాచేత చూడబడు చున్నది. లేక వినియోగింపబడుచున్నది అను భావముల రెంటిని హవిస్సులను చేసి వ్రేల్చినచో అట్టి యజ్ఞాగ్నిలో బడి నేను లేక నీవు అన్న భావము ఆత్మ లేక బ్రహ్మములో విలీనమై నిత్యయుక్తత్వము లేక జీవన్ముక్తి సంప్రాప్తమగును.

చూచెడివాడు, చూడబడెడిది లేక గ్రహించువాడు, గ్రహింపబడునది అనే ద్వైతము కలిగియున్న ఈ దృశ్య ప్రపంచము నేను కాను, పరబ్రహ్మము కంటే వేరుకాను అని తెలిసి కొని ఉపాసన చేసిన ముక్తి సాధకమగును.

'నగాయత్ర్యాః పరోమంత్రః' అనగా గాయత్రిని మించిన మంత్రం లేదని కొనియాడబడినది. అందుచే శుద్ధ చిత్తంతో, శుద్ధ సంకల్పంతో ఈ మంత్రాన్ని నిత్యం శ్రద్ధా భక్తులతో జపించిన జన్మకు అర్థం, పరమార్థం లభించి తరించెదరు. ఇది మన కనీస విధి, ధర్మం.

బ్రాహ్మణత్వము సిద్ధిస్తుంది. జీవాత్మ, పరమాత్మల అబేదాన్ని లేక అద్వైత జ్ఞానాన్ని అనుగ్రహిస్తుంది.

# ఫలశ్రుతి

తతే తత్కథితలదేవి రహస్యం సర్వ కామదమ్
సర్వపాప ప్రశమతం సర్వతీర్థ ఫలప్రదమ్
సర్వరోగహరం పుణ్యం సర్వజ్ఞానమయం శివమ్
సర్వసిద్ధిప్రదం దేవి సర్వసౌభాగ్య వర్ధనమ్
ఆయుష్యం వర్ధతే నిత్యం లిఖితం యత్ర తిష్ఠతి
నచోరఆగ్ని భయం తస్యనచ భూత భయం క్వచిత్
కింపునః శ్రణోక్తేన తదాపి చవదామ్యహమ్
మహాపాతక కోటీనాం భంజనం స్మృతి మాత్రతః
అపవాదక దౌర్భాగ్య శమనం ముక్తి భుక్తిదమ్
విషరోగాది దారిద్ర్య మృత్య సంహార కారణమ్
సప్తకోటి మహామంత్రపారాయణ ఫలప్రదమ్
శతరుద్రీయ కోటీనాం జపయజ్ఞనాం ఫలప్రదమ్
చతుస్సముద్ర పర్యంతం భూదానం తత్ఫలం శివే
సహస్రకోటి గోదాన ఫలదం స్మృతి మాత్రతః
కోట్యశ్వమేధఫలదం జరామృత్యు నివారణమ్
కన్యాకోటి ప్రదానేన యత్ఫలం లభతేనరః
తత్ఫలం లభతే సమ్యక్ నామ్నాం దశశతీజపాత్
యశ్శృణోతి మహావిద్యాం శ్రావయేద్వా సమాహితః
సోసిముక్తి మవాప్నోతి యత్రగత్వానశోచతి
బ్రహ్మహత్యాది పాపానాం నాశస్స్యా చ్ఛ్రవణేనచ

కింపునః పఠనాదస్య ముక్తిస్స్యాదన పాయినీ
ఇదం రహస్యం పరమం పురాణం స్వస్త్యయనం
యస్సకృద్వాపఠేత్ స్తోత్రం శృణుయాద్వా సమాహితః
లభతే చతతః కామానంతే బ్రహ్మపదం వ్రజేత్
నచశత్రూన్ జయేత్సద్యోమాతంగ మివకేసరీ

# శ్రీ గాయత్రీ అష్టోత్తర శతనామస్తోత్రం

శ్రీ గాయత్రీ జగన్మాతా పరబ్రహ్మ స్వరూపిణీ
పరమార్థ ప్రదాజప్యా బ్రహ్మతేజో వివర్ధినీ ॥
బ్రహ్మాస్త్రరూపిణీ భవ్యా త్రికాలధ్యేయ రూపిణీ
త్రిమూర్తి రూపా సర్వజ్ఞా వేదమాతా మనోన్మనీ ॥
బాలికాతరుణీ పద్ధా సూర్యమండల వాసినీ
మందేహ దానవధ్వంస కారిణి సర్వ కారణా ॥
హంసారూఢావృషారూఢా గరుడా రోహిణీ శుభా
షట్కుక్షీస్త్రివద్నాశుద్ధా పంచశీర్షా త్రిలోచనా ॥
త్రివేద రూపా త్రివిధా త్రివర్గ ఫలదాయినీ
దశహస్తా చంద్రవర్ణా విశ్వామిత్ర వరప్రదా ॥
ధశాయుధ ధరా నిత్యా సంతుష్టా బ్రహ్మపూజితా
ఆదిశక్తిర్మహావిద్యా సుషుమ్నాగభ్యా సరస్వతీ ॥
చతుర్వింశ త్యక్షరాధ్యా సావిత్రీ సత్య వత్సలా
సంధ్యారాత్రిః ప్రభాతాభ్యాం సాంఖ్యాయన కులోద్భవా ॥
సర్వేశ్వరీ సర్వ విద్యా సర్వ మంత్రాతిరవ్యయా

శుద్ధవస్త్రా శుద్ధ విదా శుక్లసాల్యానులేపనా ॥
సురసిధుసమాసౌమ్యా బ్రహ్మలోక నివాసినీ
ప్రణవ ప్రతిపాద్యార్థ వ్రతోద్ధరణ క్షమా ॥
జలాంజలి సుసంతుష్టా జలగర్భా జలప్రియా
స్వాహా స్వరాసుసంస్థశ్రౌషడ్వౌ షట్క్రియా ॥
సురభిష్టోదశకలా మునిబృందసేవితా
యజ్ఞ ప్రియాయజ్ఞమూర్తిస్స్రుక్స్రువాజ్య స్వరూపిణీ ॥
అక్షమాలధరాచాక్షమాలాసంస్థాక్షరాకృతి :
మధుచ్ఛంద ఋషి ప్రీతాస్వచ్ఛందా ఛందసాంనిధీ ॥
అంగుళీవర్వ సంస్థానా చతుర్వింశతి ముద్రికా
బ్రహ్మమూర్తీ రుద్రలిఖా సహస్రపరమాత్మికా ॥
విష్ణు హృద్గాచాగ్ని ముఖీశతమధ్యా శతాంవరా
సహస్రదళ పద్మస్థా హంసరూపానిరంజనా ॥
చరాచస్థా చతురా సూర్య కోటి సమప్రభా
పంచవర్ణముఖీ ధాత్రీ చంద్రకోటి శుచిస్మితా ॥
మహాయాయా విచిత్రాంగీ మాయా బీజవాసినీ
సర్వయంత్రాత్మికా సర్వతం త్రరూపాజగద్ధితా ॥
మరాద్య పాలితా మాన్యా మహామగేత్ర ఫలప్రదా
ఇత్యాష్టోత్తరత నామాని గాయత్ర్యాః ప్రోక్త వాస్మని ॥
ఏత దష్టోత్తర శతం నిత్యం భక్తియుతశ్శుచిః
త్రిసంధ్యంయః పఠేత్సర్వా మంత్రసిద్ధి మవాప్నుయాత్ ॥
ఇతి శ్రీవశిష్ఠ ప్రోక్త గాయత్ర్యష్టోత్తర శతనామ
స్తోత్రం సంపూర్ణమ్ ॥

ఆపా

# శ్రీ గాయత్రీ కవచమ్

**నారద :**

స్వామిస్సర్వ జగన్నాధ సంశయోస్తి మమప్రభో
చతుష్షష్టి కళాభిజ్ఞ పాదుకా యోగవిద్వ
ముచ్చతే కేన పుణ్యేన బ్రహ్మరూపంకథం భవేత్
దేహశ్చ దేవతారూపో మంత్రరూపో విశేషతః ॥
కర్మకచ్ఛ్రోతు మిచ్ఛామిన్యాసంచ విధిపూర్వకమ్
ఋషిశ్ఛందో దైవతం చధ్యానం చవిధివత్ప్రభో ॥

**శ్రీ నారయణ ఉవాచ :**

అస్త్యేకం పరమంగుహ్యం గాయిత్రీ కవచం తథా
పఠనాద్ధారణాన్మర్త్యస్సర్వ పాపైః ప్రముచ్యతే ॥
సర్వాన్కామానవాప్నోతి దేవీ రూపశ్చజాయతే
గాయత్రీ కవచస్యాన్య బ్రహ్మా విష్ణు మహేశ్వరా ॥
ఋషయః ఋగ్యజుస్సా మాధర్వశ్ఛందాంసి నారద
బ్రహ్మరూపాదేవతోక్తా గాయత్రీ పరమాకళా ॥
తద్బీజం భర్గ ఇత్యేషా శక్తిరుక్తా మునీషిభి
కీలకం ధియః ప్రోక్తం మోక్షార్థే వినియోజనమ్ ॥
చతుర్భిర్హృదయం ప్రోక్తం చతుర్భిస్తుశిరంః స్మృతమ్
పంచభిస్స్యాచ్ఛి ఖాపశ్చాస్త్రత్రి భిస్తుకవచం స్మృతమ్ ॥
చతుర్భిర్నేత్ర ముద్దిష్ట చతుర్భిస్యాత్త దస్త్రకమ్
అథధ్యానం ప్రవక్ష్యాను సాధకాభీష్ట దాయకమ్ ॥

ముక్తావిద్రమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై
ర్యుక్తామిందు నిబద్ధరత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికామ్
గాయత్రీం వరదాభయాం కుశ కశాః శుభ్రం కపాలంగదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్త్యైర్య హంతీంభజే ॥
గాయత్రీం పూర్వతః పాతుసావిత్రీ పాతుదక్షిణై
బ్రహ్మశ్రీ సంధ్యాపాతుమే పశ్చాదుత్తరాయాం సరస్వతీ ॥
పార్వతీ మేదిశం కక్షత్పావకిం జలశాయినీ
యాతుధానీ దిశం రక్షే ధ్యాతుధాన భయంకరీ ॥
ప్రాపమానీం దిశం పవమాన విలాసినీ
దిశం రౌద్రీంచ మేపాతు రుద్రాణీ రుద్రరూపిణీ ॥
బ్రహ్మాంర్థ్యంతు మేరక్షే దదస్తా ద్వైష్ణవీ తథా
ఏవందశ దిశోరక్షే త్సర్వాంగం భువనేశ్వరీ ॥
తత్పదం పాతుమే పాదౌ జంఘేమే సవితః వదమ్
వరేణ్యం కటి దేశంతం నాభింభర్గ స్తదైవచ ॥
దేవస్య మేతద్హృదయం ధీమహీతిచ మేగళం
ధియః పదంచ మేనేత్రీయః పదంమే లలాటకం ॥
నః పాతు మేవదనం మూర్ధ్ని శిఖాయాం మేప్రచోదయాత్
తద్వర్ణఃపాతుం మూర్ధానం నకారః పాతుఫలకం ॥
చక్షుఃపాతం వికారార్ణస్తు కపోలయోః
నాసాపుటం పకారార్ణో రేకారస్తు ముఖేసదా ॥
ణికార ఊర్ధ్వ మోష్టం తుయకార స్తథోష్టకం
అస్తమధ్యే భూకారర్ణో గోకారశ్చబుకేతథా ॥
దేకారః కంథదేశేతు వకారస్స్కంధ దేశకం

న్యజారో దక్షిణం హస్తం ధీకాలో వామహస్తకం ॥
మకారో హృదయాం రక్షేద్ధికార ముపరేతథా
ధికారో నాభిదేశేతు యోకారస్తు కంటిం తథా ॥
గుహ్యం రక్షతు యోకార ఊరూద్వౌసః పదాక్షరం
ప్రకారో జాను నీరక్షే చ్ఛోకారో జంఘు దేశకం ॥
దకారో గుల్భదేతుశేం యాకారః పద్మయుగ్మకం
తికారద్యం జనంచైవ సర్వాంగం మే సదావతు ॥
ఇదంతుంవచం దివ్యం బాధాశత వినాశనం
చతుష్షష్టి కళా విద్యాదాయకం మోక్ష కారకం ॥
ముచ్యతే సర్వపాపేభ్యః వరం బ్రహ్మాధిగచ్ఛతి
పఠనాచ్ఛ్రవణాద్వాపి గోసహస్ర ఫలం లభేత్ ॥
ఇతి శ్రీదేవీ భాగవతే మహాపురాణే ద్వాదశ
స్కంధే గాయత్రీ మంత్రకవచమ్ నామ
తృతీయోధ్యాయః

-oOo-

## -: శ్రీ గాయత్రీ ధ్యానమ్ :-

గాయత్రీ వేదదాత్రీం శతమఖ ఫలదాం వేదశాస్త్రైక వేద్యాం
చిచ్ఛక్తిం బ్రహ్మవిద్యాం పరమశివదాం శ్రీపదం వైకరోతి
సర్వోత్కృష్ట పదం తత్సవితురను పదంతే వరేణ్యం శరణ్యా
భర్గో దేవస్య ధీమహ్య భిదధతి ధియోయోనః ప్రచోదయాత్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు

## వితరణ శీలురు

| | | |
|---|---|---|
| 1 | శ్రీ వి చలపతిరావు | రూ. 58-00 |
| 2. | శ్రీ ఎస్ సుదర్శన్ | 1.116-00 |
| 3 | సాయి బేకరీ, దిల్‌సుఖ్‌నగర్ | 50-00 |
| 4. | శివా లెదర్ కలెక్షన్స్ | 11-00 |
| 5. | శ్రీ సాయిరాం కమ్యూనికేషన్స్ | 50-00 |
| 6. | శ్రీమతి రంగా ఆంజనీదేవి | 58-00 |
| 7. | శ్రీ ఆర్. సత్యనారాయణ | 101-00 |
| 8. | శ్రీ ప్రకాశరావు, ఐ.డి పి ఎల్. | 20-00 |
| 9. | శ్రీ గొర్తి వెంకటేశ్వర్లు | 60-00 |
| 10. | శ్రీ గొర్తి సత్యనారాయణ | 60-00 |
| 11. | శ్రీ కె. శ్యామాచారి | 75-00 |
| 12. | శ్రీ మల్లెల రామానందం | 58-00 |
| 13. | శ్రీమతి రంగావఝుల అన్నపూర్ణ | 50-00 |

## ప్రచురిత రచనలు .

1 *అశ్రుఝరి (కవితాసంపుటి ) 1992*

2 *అల (కవితా సంపుటి) 1993*

3 *వ్యాస ప్రసాదం 1994*

4 *కాంతి బంధం (కవితా సంపుటి ) 1995*

5 *లక్షణ దీపిక, 1996*

6 *శ్రీ సాయి కిరణాలు, 1996*

7 *ఆరిపోని చేవ్రాలు (కవితా సంపుటి) 1996*

8 *భగవద్గీతానుశీలన, 1997*

9 *మైత్రీ సౌందర్యం, 1997*

10 *వేదమాత గాయత్రి, 1997*